





# నాటకాలు

భక్తి,జ్ఞాన,పురాణ,జానపద

## చదువెందుకో తెలుసా ?





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరవిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

Subject

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

Language

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!



ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

శ్రీ రామ.

# చదువెందుకో తెలుసా?

(విద్యా ప్రచార నాటకము.)



రచయిత,

బొడ్డుపల్లి సుబ్బారావు,

టీచరు–మేనేజరు.

ఎయిడెడ్ ఎలిమెంటరీ పాఠశాల,

భూషాయపాలెము.



1959.

## —: కృ త జ్ఞ త :—

నాచే రచింపబడిన 'చదువెందుకో తెలుసా ?' అను నీ నాటకమును అచ్చొత్తించుటకుగాను నా ప్రస్తుత నివాసస్థాన మగు గుంటూరు జిల్లా, బాపట్ల తాలూకా, భూషాయపాలెము గ్రామపౌరులు యథోచిత ధనసహాయ మొనరించి మిక్కిలిగా తోడ్పడినందులకు వారికి నా మనఃపూర్వక కృతజ్ఞతాభినందనము లర్పించుచున్నాను.

ఇట్లు,
ర చ యి త,
బొడ్డుపల్లి సుబ్బారావు.

# వి జ్ఞ ప్తి.

చదువరులారా !

బోధకుఁడుగా నాకు గల అనుభవమునుబట్టి విద్యావశ్యకతను గూర్చి పల్లెప్రజలలో కొంత ప్రచారముండు టత్యావసరమని తోచెను. అందువలన నాకు గల సామాన్య జ్ఞానముతో 'చదు వెందుకో తెలుసా ?' అను నీ నాటక రచనకు బూనితిని. కాని నా పాండిత్యాతిశయ ప్రకటనమునకు మాత్రము కాదు. కనుక నిం దనేక దోషములుండుట సహజము. వానిని చదువరులు మన్నింప ప్రార్థన.

ఈ నాటకము సామాన్య ప్రజలకు సులభముగా బోధపడుటకుగాను మొదటినుండి తుదివరకు వ్యావహారికములోనే వ్రాసితిని. ఇందువచ్చు పాత్రలు, ఆ యా ఘట్టములు కల్పితములేగాని యథార్థములు గావు. నాటక రచనోద్దేశమును బహిరంగ పరచుటకు నట్టి పాత్రలు,ఘట్టములు నిర్మింపబడినవేకాని వ్యక్తిగత దూషణ, భూషణములకు మాత్రము కాదని మీకు మనవి చేయుచున్నాను.

మిత్రులారా !

ఈ నాటక రచనలో నాకు అపూర్వమైన సలహాలనిచ్చి తోడ్పడి దీని నీ రూపమునకు దెచ్చిన మీకు నా ధన్యవాదములు.

ప్రదర్శకులారా !

మీరు మీ నటనాకౌశలముతో నీ నాటకమును జక్కగా ప్రదర్శించి యీ నా కృషికి నితోధిక ప్రోత్సాహ మీయవలయు నని మీకు నా విన్నపము.

విద్యావేత్తలారా !

అడిగినంత మాత్రముననే అరమర లేక తమ యమూల్యమైన అభిప్రాయముల నందించి యీ నాటకమునకు నూతన శోభను కలిగించిన తమకు నా వినయపూర్వక నమస్కృతులు.

ఇట్లు,

ర చ యి త.

# ఉపోద్ఘాతము.

(సంస్కృత) } 'సాహిత్యవిద్యాప్రవీణ'
"సాహిత్యరత్న"
(తెలుఁగు) "భాషాప్రవీణ"
అవ్వారి వాసుదేవశాస్త్రి,
(Ex. Sanskrit College Lecturer.)

**'చదువెందుకో తెలుసా?'** అను పేరుగల యీ నాటకమును నేను రెండు మూఁడు సారులామూలాగ్రముగా విమర్శనదృష్టితో బాగుగఁ జదివిచూచినాను. చాల బాగుగనున్నది.

ఈ కవిగారు వచియించినట్లుగా నిది వారు "పాండిత్యాతి శయ ప్రకటనకై వ్రాసియుండలేదు" గావునను, వ్యావహారిక భాషకే యిందుఁ బ్రాధాన్య మిచ్చియున్నారు గావునను, నిందలి పాత్రౌచిత్య మును బట్టి ఆ యా పాత్రల కట్లు తప్పని సరిగా వ్యావహారికమే వాడ వలసియున్నది కాఁబట్టియు భాషలోని గ్రాంథికతా విషయమున మన మెక్కువగాఁ దడవఁ బనిలేదు. అయినను సాధ్యమయినంత వఱకుఁ గవి వాక్యములలోను, నితర స్థలములలోను, "ఆసీనులై యుందురు" "ఉచితమగు స్థానములఁ గూర్చుండి యుందురు." "పోస్టుమాష్టరు రంగనాథము మాత్రమే యుందురు" "సక్రమముగనే యున్నదన్ని నమ్ముచు ఖర్చులతో సహ డిక్రీ" మొదలగు చోట్లఁ, దమకున్న గ్రాంథిక భాషాభిజ్ఞతను, అభిరుచిని గవిగారు చక్కగా నిర్దుష్టముగాఁ బ్రదర్శించి యున్నారు.

ఇక నాటకమునకు ముఖ్యముగఁ గావలసిన శిల్పచిత్రణము, కథా గమనమున పూర్వోత్తరముల కవైరుద్ధ్యము, పాత్రోచిత సంభాషణ, సమయోచిత పాత్రప్రవేశము మున్నగునవి యిందుఁ జక్కగాఁగలవు.

ఇందలి సంభాషణలలో నా యా పాత్రలకు సహజత్వము బాగుగ గోచరించుచున్నది. ఉదాహరణకు :- (చదువుకొనుటకుముందు) రైతు రామయ్య, గురవయ్య, పీరు, మొదలగుపాత్రల సంభాషణములను జూడవలయును.

సన్నివేశములన్నియు సహజములే యైనను గల్పనా చమత్కృతి కిందు నచటనచటఁ దావుగలదు. అస లిందలి కథాకల్పనమే మిగుల నందముగా నున్నది. ఆ యా పాత్రల తాహతు ననుసరించి వారి వారికి, ఆ యా సమయములకుఁ దగిన సంభాషణమును, గ్రాంథికము గాను, వ్యావహారికముగాను, ఉభయసమ్మిశ్రముగాను నడపి యున్నారు.

ఈ కవిగారు సహజముగా శిల్పమునందు మిక్కిలి ప్రావీణ్యము గలిగి తత్తత్ప్రదర్శనములలోఁ బారితోషికముల నందిన వారగుటచేతఁ గాబోలు కథా శిల్పమును జక్కఁగా దీర్చిదిద్దఁ గలిగినారు. కథను జక్కఁగా నడపఁగలిగినారు. మొదటినుండి చివఱిదాక ఎట్టి గొగ్గులు లేకుండ, భాషయేమి ? సంభాషణయేమి ? కథయేమి ? చక్కఁగా నడచినది.

సహజముగా, నుపాధ్యాయులగుటచేతఁ బాఠశాలలో జరగు ఆ యా ఉత్సవములలోఁ జిన్ని చిన్ని నాటికల సృష్టించి, పిల్లలచే వేయించు నలవాటు వీరి కుండుటచేతఁ గాఁబోలు తదభ్యాసముననై యుండును. దీనినిసర్వాంగ సుందరముగాఁ దీర్చి దిద్దఁగలుగుట సంభవించినది.

ఇందు గోపాలరావు, రామయ్య, భీమశంకరము అనువార లుపన్య సించిన దానివలన మన దేశమందలి యనక్షరాస్యత, ఇతరదేశ స్థితి గతులు, అందులకుగాను బూనవలసిన పూనిక, దానివలన గలుగు సత్ఫలితములు చక్కఁగా గ్రహింప వీలుకలుగుచున్నది.

దీనిలో నిరక్షరాస్యతా నిర్మూలనమునుగూర్చియే ముఖ్యముగాఁ బ్రతిపాదింప దలచినను నందందు నానుషంగికముగాఁ గూట సాక్ష్యములు చెప్పువారి దుర్గతులు, కుకల్పనలు చేయువారి యధోగతులు నిరూపింపబడి యట్టివానినుండి జనసామాన్యమును నివారించుట గాననగును. ఆయా విషయములన్నియు నిందు కథకు సంబంధింపఁబడినవిగానే సంతరింపఁబడి శాఖాచంక్రమణముగాఁ బోకడపోకుండుటలోఁ గల కవిగారి నైపుణ్యము పూర్తిగా గ్రహింప వీలు కలుగుచున్నది.

ఈ పుస్తకము మొత్తము వచనాత్మకముగానే యున్నను నచ్చటచ్చట నలఁతిగాఁ బద్యములనుగూడఁ గూర్చి "నాటకాలలోఁ బద్యము లుండవలె" నను వారి సిద్ధాంతమునుగూడ ననుసరించిరి. అయిన నొక్క విశేషము :- "పద్యము లితరులచే వ్రాయించుట" యను నిప్పటి కొందఱి పద్ధతి నవలంబింపక యథాశక్తి తామే కొన్ని పద్యములఁ గూర్చి యిందుఁ జేర్చియున్నారు. ఈ విషయములో సంస్కృతకావ్యలక్షణ కర్తలలో నితర లాక్షణికులవలెఁగాక జగన్నాథ పండితరాజు తన లక్షణములకుఁ దన యుదాహరణములనే యిచ్చు సందర్భమున "నా గ్రంథమున నితరుల పద్యములఁ జొప్పించు టెందులకు?" అన్న మాటలు ఛాయావాహిగా జ్ఞప్తికి వచ్చుచున్నవి.

ఈ పుస్తకమును నేను జదువుచుండఁగాఁ దీసికొని, చూచినవారు చాలమంది "యిది బాగుగ నున్నదనియు, నిది యొక ప్రతి తమకుఁ గావలె"ననియుఁ జెప్పియున్నారు.

ఇట్లు మిగుల నాకర్షకమై యెల్లఱ హృదయముల నానందింపజేయుచు నిరక్షరాస్యతా నిర్మూలనమునకై యుద్దేశింపఁబడి అక్షరాస్యతయొక్క అవశ్యకత్వమును మిక్కిలి చక్కగాను, ఎక్కువగాను బోధించుచున్న యీ పుస్తకము అందఱికినిఁ గావలసినదిగ నున్నది.

ఇట్టి పుస్తకమును సంతరించి ప్రాథమిక విద్యార్థులకును, వయోజన విద్యాభిలాషులకును, మిక్కిలి స్తుతిపాత్రమగుచున్న యీ కవిగారిని నేను మిగుల నభినందించుచున్నాను.

ఈ పుస్తకమును ప్రభుత్వమువారును, ప్రతి పాఠశాలోపాధ్యాయులును నాదరించి గ్రహించి, బడి బాలురచేఁ బ్రదర్శింపఁజేసి మనదేశమునఁ గల నిరక్షరాస్యతను నిర్మూలించుటకుఁ బూనుకొందురు గాక!

(స్వస్తి.)

ఇట్లు,
బుధజనవిధేయుడు,
(*Sd.*) అవ్వారి వాసుదేవశాస్త్రి
(తెలుగు పండితుఁడు),
బోర్డుహైస్కూలు, కొల్లిపర.

కొల్లిపర
8-12-1958.

అభిప్రాయము - 1

విమర్శక శిరోమణి, సాహిత్యవిశారద

(ఆంధ్ర సారస్వతపరిషత్తు ప్రధాన కార్యదర్శి)

## శ్రీ కోన వేంకటరాయశర్మగారు

ఉగ్గుపాలతో జీర్ణించి యున్న మన సంప్రదాయములు, మన విజ్ఞానము, మన నాగరకత, మన మట్టు మర్యాదలు, పాశ్చాత్య నాగరికతా వ్యామోహితు లైన కొందఱు మట్టి పాలొనర్చుచున్నారు. తత్రాపి భాషలో - భావములో - నీతినియమాలలో - ఐకమత్యములో -వక్రత యగపించుట దటస్థించినది. ఈ తీరుతీయములలో దిద్దుబాట్లుగావించి ప్రజలను నడిపింపవలసిన విధి ప్రభుత్వముపైఁ గలదు. కావుటంజేసి ''ఆధారక విద్యావిధానము''ను దత్సంప్రదాయములను గ్రామీణులలోఁ బ్రవేశపెట్టి యా మూలమున నిరక్షరాస్యతను, వ్యవహార పరిజ్ఞాన విహీనతను, ప్రభుత్వము పాలనావిధానమునెడ వైముఖ్యమును-బోఁగొట్టి, తప్పుత్రోవకుఁ బోకుండ కమ్మెచ్చునఁ దీర్చవలసిన తరుణమున చిరంజీవి బొడ్డుపల్లి సుబ్బారావు ఈ నాటికను వ్రాసి పల్లెలలో జరగు అక్రమములఁజూపి, గ్రామీణుల హృదయములు వినిర్మలములు, ఆదర్శయోగ్యములు, అనుసరించఁదగు మార్గములు - అని నిరూపించి, తన కలమునకు సార్థకత కలిగించినాఁడు.

ఈ చిరంజీవి యుపాధ్యాయవృత్తియందున్నను అవకాశము గల్పించుకొని తన యూహాపోహలకొలఁది ఈ నాటికనువ్రాసి సోదర ఉపాధ్యాయులకు, గ్రామీణులకు, అందిచ్చుట మెచ్చుకోఁదగినది. ఈ చిరంజీవి పరిశ్రమ వమ్ముఁ గాకుండజూచి ప్రోత్సహించుట ధర్మమనితోఁచి యీ నాల్గు మాటలు సంతరించితిని.

ఇంతటితో నాఁగక ఈ చిరంజీవి మున్ముందిట్టి ప్రబోధావశ్యకములగు నుత్తమగ్రంథముల నుత్తమమార్గమున రచించి యస్మదాదుల యాశీస్సుల నందుఁగాక ! యని కోరుచున్నాఁడను.

నాగేశ్వరపురము, బాపట్ల:
14–12–58

(Sd) కోన వేంకటరాయశర్మ

# OPINION—2

**Sri K. SAMBASIVA RAO,**
*B. Ed. Training Class, Govt. Trg. College*
RAJAHMUNDRY
*Ex. Junior Deputy Inspector of Schools,*
*Bapatla Hindu Range.*

On the whole this drama is very interesting. The purpose for which it is written is fully satisfied. It awakens the illiterates & directs them towards education. The characters are quite apt and the language is best suited to the situation and for educational propaganda. This drama is really a golden work which I hope shall receive great encouragement hands & hearts of all the educationists.

RAJAHMUNDRY
6—7—'57

(*Sd*) K. SAMBASIVA RAO,

అభిప్రాయము 3

**Sri B. CHENCHAIAH,** *B. A. B. Ed.*
*Deputy Inspector of Schools*
**BAPATLA, Hindu Range.**

శ్రీ బొడ్డుపలి సుబ్బారావుగారిచే రచించబడిన **'చదువెందుకో తెలుసా ?'** అను నాటకమును చదివి ఆనందించితిని. నాటకమును చదువ ప్రారంభించి పూర్తియగు వరకు వదలుట కిష్ట పడనైతిని. ఇందలి విషయములు సామాన్యమైనవైనను కథాంశములు చదువరులకు ఉత్సాహము గొలుపుచుండును.

ఇరువదవశతాబ్ది మధ్యములో ఇందలి గ్రామ్యబాష కొంత అతిశయోక్తియైనను అట్టిభాష నుపయోగించుటచే ప్రేక్షకులకు నవ్వు బుట్టించుచు ఆకర్షింపజేయు ననుటకు సందేహము లేదు. ఇది వయోజన విద్యా ప్రచారము చేయుట కెంతో తోడ్పడుచున్నది. విద్యా విహీనతవలని నష్టములను, ప్రత్యక్షముగా చాటుచున్నది. ఈ నాటకకము ప్రాథమిక పాఠశాలలయందు వార్షికోత్సవ సమయములలో ప్రదర్శించుట కెంతో యుపయోగకరము.

BAPAILA
**19—10—58**

(Sd.) **B. CHENCHAIAH**

అభిప్రాయము - 4

# Y. KRISHNAMURTY

JUNIOR DEPUTY INSPECTOR OF SCHOOLS

**BAPATLA**

శ్రీ బొడ్డుపల్లి సుబ్బారావుగారిచే నటనా యోగ్యముగా రచింపబడిన "చదువెందుకో తెలుసా ?" అను పాత్రము లేత హృదయముల నాకర్షించు తీరున మృదుమధుర పచనములతో అలరారుచున్నది నిరక్షరాస్యు లగు పయోజనులు, తమ అజ్ఞాన, మూఢత్వముల కంఠ్డార గాంచి అక్షరాస్యు లగుటకు దోహద మిచ్చుచున్నది. రచయిత నేర్పరితనము కాలానుకూలముగ నడచినది.

వేదికల కుపయోగపడు యిట్టి విద్యావిషయక నాటిక లింకను రచించి, రచయితగారు విద్యాభివృద్ధి కెంతయు దోహద మొసగుదురని ఆశించు చున్నాను.

BAPATLA
14—12—'58

**(Sd.) Y. Krishnamurty.**

అభిప్రాయము — 5

## Sri B. NARAHARI SASTRY, M A.

ఈ రచయితచే రచియింపబడిన ఈ గ్రంథము వారి ఉద్యోగానుభవమునకు దర్పణము వంటిది. ఈనాటకమునందు ఇరువది పాత్రలు గలవు. ఇది సామాన్య విషయము. నాటక రచయిత స్వయం శక్తిని గోల్పోయి ప్రతి పాత్రయందు తాదాత్మ్యమును పొందవలయును. అందువల్లనే వయసు ముదిరిన వెనుక నాటకమును వ్రాయుమని పెద్దలు చెప్పెదరు. ఈ శక్తి వీరియందు కొంతవరకు గలదు. ఇది వారి ప్రథమరచనయే కదా! దీనికి వారు దోహద మొసగుట మంచిది.

కాలముతోపాటు సాహిత్యమునందు పోకడలు మారుట చాల సహజమైన విషయము. అధునిక రచయితలు దుష్టశక్తులను రంగముపైకి నెక్కించి విమర్శించుదురు. వీనిని నిందాకావ్యము లనవచ్చును. కాని సామాజకులకు గనువిప్పు కలిగించుట ఇట్టి గ్రంథముల పని.

ఈ నాటకమునందు చమత్కారములు తక్కువ. కాని సన్నివేశములున్నవి. రామయ్య పోస్టాఫీసునందు వందరూపాయల నోటు నిచ్చుట అట్టివానిలో నొకటి. రామయ్య, పీరుసాహెబు పాత్రలు చాల సహజముగ ఉన్నవి. గుగ్గిళ్ళ గురవయ్య వంటి వారిని మనము నిత్యము చూచుచుందుము. కాని అట్టి పాత్రను చిత్రించుట కష్టము. ఇందు నాగుల పాత్ర నాటకమునకు మకుటాయమానము.

భాషగ్రామ్యము. ముఖ్యముగ పతితలుగ ఉద్దేశింపబడినవారు గ్రామీణులు. రచన సహజముగ నుండవలయును గదా? ఉన్నది ఉన్నట్లు వ్రాసినది రచనయగునా కాదా యని అలంకారికుల యందు వివాదములున్నవి. పోనిండు, వారు పూర్వకాలపు వారుగదా? ఒకింత యోర్పు వహింతము. గుణ గణములయందు రాజపదము నందుకొని నక్షమా గుణమునకు నమస్కారములు.

VEDULLAPALLI<br>28—4—57

(*Sd.*) **B. Narahari Sastry.**

## అభిప్రాయము - 6

'సాహిత్య విద్యాప్రవీణ' & 'భాషాప్రవీణ'

# శ్రీ చెఱుకుపల్లి సూర్యనారాయణ శాస్త్రిగారు

బోర్డు హైస్కూల్ సీనియర్ తెలుఁగు పండితులు.

అయ్యా!

మీ 'చదువెందుకో తులుసా?' అను నాటకమును జదివినాను. చాల బాగుగ నున్నది. హాస్యరస ప్రధానమగు నీ నాటకమున 'రామయ్య' యను పాత్రవలన అవిద్యచేఁ గలుగు కష్టనష్టములు, విద్యచేఁ గలుగు సుఖ గౌరవములు, నిరక్షరాస్యుల హృదయము లందు హత్తుకొనునట్లు చిత్రించినారు. ఇట్టి నాటకములు, పెక్కురు నిరక్షరాస్యులు గల మనదేశమున కెంతయు నావశ్యకములు. ఇయ్యది నిరక్షరాస్యత యను పిశాచమును బారఁద్రోలుటకు మహా మంత్ర మని చెప్పుట యతిశయోక్తి గానేరదు.

వయోజన విద్యాలయములను ఊరూర నెలకొలిపి, డబ్బును వెచ్చించి, నిరక్షరాస్యతను రూపుమాపుటకు మన ప్రజా ప్రభుత్వము చేయు ప్రయత్నమున కెంతయు నియ్యది చేయూఁత నొసంగఁ గలదని నా విశ్వాసము.

విద్యాధికులు, ప్రభుత్వము, విద్యాలయ ప్రధానాధ్యాపకులు నిట్టి నాటకములు పెక్కుగా నింకను వెలువడుటకుఁ దగిన ప్రోత్సాహ మీయఁ గలరని తలంచు చున్నాను.

కొల్లిపర
9—3—'59

ఇట్లు,
(Sd.) చెరుకుపల్లి సూర్యనారాయణ శాస్త్రి.

# ఇందు వచ్చు పాత్రలు.

1. రైతు రామయ్య .. చదువురాని అమాయకుడైన రైతు.
2. గోపాలరావు .. రైతు రామయ్య అల్లుడు - విద్యావేత్త.
3. పోష్టుమాష్టరు .. చెప్పుడు మాటలకు చెవియొగ్గువాడు.
4. రంగనాథము .. పోస్టు జమాను - మోసగాడు.
5. కుటుంబయ్య .. పై ్రివేటు చేయువాడు - కుట్రదారుడు.
6. పీరుసాహెబు .. కుటుంబయ్యకు అనుకూలుడు. అబద్ధపు సాక్ష్యమిచ్చుటలో అగ్రగణ్యుడు.
7. పేరయ్య .. కుటుంబయ్యకు అనుకూలుడు. ఫోర్జరీలు వ్రాయుటలో నేర్పరి.
8. సబిన్‌స్పెక్టరు .. కార్యమును పూనికతో సాధింపదలచు స్వభావము కలవాడు.
9. జడ్జి .. న్యాయాన్వేషణయందు ఆసక్తి కలవాడు.
10. ఒకటవ ప్లీడరు .. కుటుంబయ్య తరపున వాదించువాడు. ధనార్జనయే ప్రధానముగా గలవాడు.
11. రెండవ ప్లీడరు .. రైతు రామయ్య తరపున వాదించువాడు.
12. గురవయ్య .. యుక్తిగా, సాక్ష్యమును చెప్పక తప్పించుకొన్నవాడు.
13. ప్యూను .. కోర్టు జమాను.
14. కానిస్టేబుల్ .. తన డ్యూటీని సక్రమముగా నెరవేర్చుకొనువాడు.
15. లక్ష్మణరావు .. రివిన్యూ ఇన్‌స్పెక్టరు.
16. రామన్ .. రివిన్యూ ఇన్‌స్పెక్టరు కుమారుడు.
17. మోహన్ .. రామన్ స్నేహితుడు.
18. జగన్నాథరావు .. ధనవంతుడు, భూవసతి కలవాడు.
19. నాగులు .. లోకజ్ఞానము గల విద్యావిహీనుడు.
20. భీమశంకరము .. హైస్కూలు హెడ్మాష్టరు.

[illegible] 13 [illegible]
[illegible]లో సులభముగా ప్రదర్శింపవచ్చును.

# ఒకటవ అంకము

## మొదటి రంగము

### రెవిన్యూ ఇన్‌స్పెక్టరుగారి యిల్లు

ఇన్ స్పెక్టరు లక్ష్మణరావు, పడక కుర్చీలో పండుకొని పేపరు చదువుకొనుచుండును. మోహన్ అను విద్యార్థి ప్రవేశించును.

మోహన్:— ఇనెస్పెక్టరుగారు! మీ రామన్ ఏడండి?

లక్ష్మణరావు:— (ముందుకుచూచి) పెరటిలో బావిదగ్గర స్నానం చేస్తున్నాడు. వస్తాడు. ఆ బల్లమీద కూర్చో.

మోహన్:— (కూర్చుండి తనలో) ఇంకా స్నానం చేస్తూనే ఉన్నాడా! టైమ్ కావచ్చినట్లున్నదే? (ప్రకాశముగ) సార్! టైమెంతైందండి?

లక్ష్మణరావు:— (చేతిగడియారమును చూచి) పావుతక్కువ ఆరు. సినిమాకేనా ప్రయాణం?

మోహన్:— కాదండి. ఈరోజున మాపాఠశాల వార్షికోత్సవం. ఉదయం ఆటపాటలలో పోటీలు జరిగాయి. ఈపూట నాటకాలు ఉపన్యాసాలు ఉన్నయి. మా డి. ఇ. ఒ. గారుకూడ వచ్చారు. వారు విద్యావశ్యకతనుగూర్చి గొప్ప ఉపన్యాస మిస్తారట. అయితే మీకీవార్షికోత్సవం విషయం తెలియదా సార్! మా హెడ్మాష్టరు గారు మీకుగూడా ఇన్విటేషన్ కార్డు పంపినట్లున్నారే!

లక్ష్మణరావు:— పంపే ఉండవచ్చు. అయితే నేను క్యాంపులో ఉన్నాను. ఇప్పుడే వచ్చాను. ఇదేమిటో ఈసంవత్సరం ఎక్కడబట్టినా వార్షికోత్సవాలేనే. నేను మొన్న డిశంబరు 12 వ తేదీన భూపాయపాలెం అనే ఊరికి క్యాంపు వెళ్ళాను. ఆరోజుననే వారి పాఠశాల వార్షికోత్సవమట. ఆ సందర్భంలో ఆ పాఠశాల విద్యార్థులు "చదువెందుకో తెలుసా?" అను నాటకాన్ని ప్రదర్శించారు. చాల బాగున్నది. దానిని చూచిన తర్వాత మా జమానుకు వాళ్ళ

నాయన్నికూడ చదివించాలనే కోర్కె కలిగిందంటె నమ్ము మోహన్. నిజంగా దానిని చూచినవారికి అట్టి కుతూహలం కలగ డంలో ఆశ్చర్యమేమీ లేదు.

మోహన్:— అయితే ఇన్స్పెక్టరుగారు! ఇది చాల తమాషాగా ఉన్నదండి. మేము కూడ సరిగ్గా ఆనాటకాన్నే ఈరోజున మా స్కూలులో వేయబోతున్నాం. ఆనాటకంలో మీవాడు కథా నాయకుడైన రైతు రామయ్యగాను, నేను గుగ్గిళ్ళ గురవయ్యగాను యాక్టుచేస్తాం.

రామన్:— (వళ్ళు తుడుచుకొనుచు లోనికి ప్రవేశించి) ఏమిరోయి మోహన్! అప్పుడే తయారై వచ్చావే! ఇక నాదేనా ఆలస్యం? ఇదిగో! ఒక్క నిముషంలో వస్తా చూడు. (అని వెళ్ళబోవును)

మోహన్:— సరేకాని రామన్! హెడ్మాష్టరుగారు మీనాన్నగారికి ఇన్విటేషన్ కార్డు పంపలేదుట్రా ?

రామన్.— పంపకేం పంపారు. మా నాన్నగారు ఇప్పుడే క్యాంపునుండి వచ్చారు. ఇంకా వారి కివ్వలేదులే. నాన్నగారు! ఆ డ్రాయరు సొరుగులో పెట్టాను చూడండి. (అని లోనికి పోవును)

లక్ష్మణరావు:— (డ్రాయరు సొరుగుతీసి కార్డును చూచుకొని) సరే! మోహన్ నేనుకూడ ఇప్పుడే వస్తాను. అందరం కలసి పోదాం ఉండండి. (నిష్క్రమించును)

రామన్:— (డ్రస్సు వేసికొనివచ్చి) మోహన్! మానాన్నగారు పిలు స్తున్నారు. కాఫీ తీసికొని అటు ఆగుమ్మాన పోవచ్చును పోదాంరా. (ఇరువురును నిష్క్రమింతురు.)

[తెర వ్రాలును]

## రెండవ రంగము

రైతు రామయ్యగారి యిల్లు

పోష్టు జవాను రంగనాథం ప్రవేశించును. ఇంటి తలుపులు వేసియుండును.

రామయ్య:— (లోపలనుండియే) ఆ! ఆ! ఓరారు! వత్తుండా! వత్తుండా! (చుట్టను చుట్టుకొనుచు తలుపుతీసి జమానును తేరిపారజూచి) మీరోరు బాబు! పనిమీనొచ్చారు?

రంగనాథం:— నేను పోస్టుజమాన్ని లేండి. ఇదిగో! మీకీఉత్తరం వచ్చింది. (ఒక కార్డునుతీసి రామయ్యకు అందించును)

రామయ్య:— (ఆశ్చర్యముగ) అరె! ఏంటయ్యా జవాను నీవేనా? ఇంకోరో అనుకుండా. ఈమద్దెన సూసినప్పుడు ఎంతో బాగుండావు. ఇప్పుడిట్టా సిక్కిపోయ్యావేం? జబ్బేమైనా సేసిందాపాపం?

రంగనాథం:— లేదు లేదు రామయ్యగారు! ఈమధ్య మీరు చూచిన జమాన్ని నేనుకాదండి. ఆయనకు ట్రాన్స్ఫర్ వచ్చి వెళ్ళిపోయి నాడండి.

రామయ్య:— (ఆశ్చర్యముతో నోటిమీద చేయి వేసికొని) నారాయ న్నారాయనా! ఎంతపని జరిగింది పాపం. ఇయ్యాల్టి కెన్నాలయింది బాబు! దినంకూడా ఎల్లిపోయిందా?

రంగనాథం:— (నవ్వి) చచ్చిపోలేదండీ! ఆయన్ని ఈ ఊరునుంచి మరో ఊరికి బదిలీచేశారు.

రామయ్య:— ఓ! అదా! నువ్వు ఏంటో టానసరొచ్చి పొయ్యాడంటేను అదోరకం రోగంవచ్చి సచ్చాడేమొ అనుకుండాలె. ఇప్పుడీ మందులు మర్లూ వచ్చాక అన్నీ కొత్తకొత్త రోగాలొత్తుండయిగా బాబు!

రంగనాథం :— వస్తానండి రామయ్యగారు! (అని వెళ్ళ బోవును.)

రామయ్య :— ఇదుగో జవాను! ఇప్పుడే ఎల్దువుగానిరా! ఈ ఉత్తరం యాణ్ణుంచి వచ్చిందో కూస్తె సదివిపో.

రంగనాథం :— (తనలో) ఓహో! నేననుకున్నట్లీయన అమాయకుడే కాదు. చదువురాని పెద్ద మనిషికూడ అయియున్నాడు. (తలను పంకించి) ఇకనుసరె (ఉత్తరమును మనసులో చదివినట్లు అభిన యించి ప్రకాశముగ) రామయ్యగారు! ఇది మదరాసులో ఉన్న

మీా అల్లుడు గోపాలరావుగారి వద్దనుండి వచ్చిందండి. వారికిప్పుడు నూరురూపాయ లవసరమట. వెంటనే పంపమని వ్రాశారు.

రామయ్య :— (తనలో) ఆరీడితస్సగొయ్యా! అప్పుడే మొదలెట్టాడు. నేననుకున్నంతే అయింది. అయినా ఈ ఆడోళ్ళు సెప్పినమాట ఇంటారా పెడతారా? నెత్తిన నోరెట్టుకొని మొత్తుకున్నాగంద. పిల్లని సదువుకునోడికొద్దూ కొంగ్రునోడికిద్దామని. యాడపట్టనం? యాడకత? ఇప్పుడాడకీ డబ్బెట్టా పోతది. మడిసిని పంపుదామా అంటే పైనో పదిరూపాయలుకర్సు. ఇప్పుడేం సెయ్యాలో నాకేం తోసడంలేదు. (నులకమంచముపై కూలబడును.)

రంగనాథం :— రామయ్యగారు! డబ్బుండాలెకాని దానిని పంపుటకు మీారంతగా ఆతుర్దా పడవలసిన పనిలేదు. దానికితోడు ఇంకొక రూపాయిన్నర మీాది కాదనుకొంటే పోస్టుద్వారానే మీా అల్లుడుగారికి నూరురూపాయలు రేపీపాటికి చేసుతాయి. పోస్టాఫీసుల్లో అటువంటి సౌకర్యం ఉంది. డబ్బుంటే తీసికొనిరండి ఇవ్వాళే పంపుదాం.

రామయ్య :— చరేలే జవాను. నీకసుపు సల్లంగా మంచి ఉపాయం సెప్పావు. ఇప్పుడే పైకం తెత్తుండా పద. (లోనికి పోవును.)

రంగనాథం :— (తనలో) పాపం. చదువురాని అమాయకుడైన ఈ రైతు, రామయ్య.

తే మర్కటపు మాటనమ్మిన। మకరివలెను
నేడు నామాటలకు లొంగి। నాడు, గాన
మూఢ జనులను నెంతేని। మోసగించి
తనదు కోర్కెల దీఱుచు। కొనగవచ్చు॥

అయినను నాప్లాను నెరవేరవలెనంటె ముందుగా హా పోస్టు మాష్టరుగారిని ఒప్పించవలసియున్నది. కనుకనే నీరామయ్య వచ్చు లోపల వెళ్ళి ఆపని పూర్తి చేసెదను. (నిష్క్రమించును)

తెర వ్రాలును

## మూడవ రంగము

### పోస్టుమాష్టరు గారి యిల్లు

పోస్టుమాష్టరు, జమానురంగనాథం మాత్రమే యుందురు. రైతురామయ్య ప్రవేశించును.

పోస్టుమాష్టరు:– (రామయ్యను చూచి) రా! రామయ్యబాబు రా!

రామయ్య:– వత్తుండా నాయనా! వత్తుండ.

పోస్టుమాష్టరు:– ఇదుగో రామయ్యా! ఈ బల్లమీద కూర్చో. (బల్లను చూపును) మనియార్డరు చేయాలన్నావుట పైకం తెచ్చావా?

రామయ్య:– తెచ్చాబాబు తెచ్చా. ఇదిగో పైకం. (తలగుడ్డలో నుండి తీసిఇచ్చును)

పోస్టుమాష్టరు:– రామయ్యా! ఈ పైకమును మీ అల్లుడికి పంపుతున్నావా ఏమిటి?

రామయ్య :– అవునుబాబు అవును. పట్నంకాడ ఏంటో సదువుతున్నాట్ట. ఆడిసదువు సట్టుబండలైతే డబ్బుకు నన్ను పీక్కోతినేటట్టుండాడు.

పోస్టుమాష్టరు :– అట్లాఅనకు రామయ్యా! ఈ ప్రపంచంల్లో ప్రతి వానికి గాలి, నీరు, ఆహారం ఎంతఅవసరమో చదువుకూడ అంతే అవసరం. చదువులేనివాని బ్రతుకు ఏమిబ్రతుకు రామయ్యా!

రామయ్య :– ఏంటోలె బాబు. ఈసదువులయ్యేసరికి ఉండ ఆత్తంతా ఆకరవుతది. ఆమైన అమ్మాయిబువ్వా. అయ్యా బువ్వేగ బాబు? ఇగనాను పోయొత్త. డబ్బు జాగర్తండి.

పోస్టుమాష్టరు :– డబ్బెక్కడికి పోదులే రామయ్యా! భయపడకు.

రామయ్య :– మాటవరస కన్నాకాణి మీకాడ యాడకి పోతదని భయం బాబు? ఇగనాను పోయొత్త.

పోస్టుమాష్టరు :– మంచిదిరామయ్యా!

రామయ్య :– (రామయ్య నిష్క్రమించును.)

పోస్టుమాష్టరు :– (జమానురంగనాథాన్ని చూచి) భలేప్లాను వేశా వోయి రంగనాథం!

రంగనాథం :– మరేమనుకున్నారు మాష్టరుగారు! ఇలాంటి చదువు రాని అమాయకులను ఎంతైనా మోసంచెయ్యవచ్చు. చూచారా? పచ్చనోటు పదినిముషాల్లో కాజేశాం.

పోస్టుమాష్టరు :– (సందేహముగ) కాజేశాం బాగానే ఉంది. కాని ఒకవేళ ఈ రహస్యం బయట పడితేనో ?

రంగనాథం :– మాష్టరుగారు! అసలీ విషయం ఎలాబయటకురాగల దని మీ అనుమాన మండి ?

పోస్టుమాష్టరు :– ఎలాఏమిటి రంగనాథం? రామయ్యగారి అల్లుడు క్షేమసమాచారాలు తెల్పమని రామయ్యకు జాబువ్రాస్తే నీవు ఆయనతో "మీ అల్లుడు డబ్బు పంపమని వ్రాశాడని" అబద్ధాలు చెప్పి వచ్చావు. ఆయన ఆ మాటలునమ్మి డబ్బుతెచ్చి మన కిచ్చాడు. దాన్నిమనం కాజేశాం. ఇప్పుడు ఒకవేళ ఆయన ఆ ఉత్తరాన్ని మరెవరికైనా చూపితే మన పని ఏమౌతుందంటావు ?

రంగనాథం :– (నవ్వి) మాష్టరుగారు! నేనంత తెలివి తక్కువవాణ్ణి కాదండోయి. ఇదిగో ఆ ఉత్తరం. (జేబులోనుండి తీసిచూపును.) ఆయన కివ్వకుండానే తెచ్చాను. ఇంకా ఆయన ఇతర్లకు చూపేదే మున్నది? మనం భయపడవలసిన దేమున్నది!

పోస్టుమాష్టరు :– (సంతోషముతో) అరె! నీవుచాల అసాధ్యుడ వేనోయి రంగనాథం! భేష్! మంచి తెలివైన పనిచేశావు. నేనుకూడ ఆయనకు మనియార్డరు చేసినట్లు రసీదివ్వలేదు చూచావుగా.

రంగనాథం :– మాష్టరుగారు! ఆయన రసీదుకూడ అడగలేదేమండి ?

పోస్టుమాష్టరు :- ఎలా అడుగుతాడు రంగనాథం?

తే. పాపమాయన అజ్ఞాని! పామరుండు
సుంత చదువైన నెఱుగని। వింతపశువు
అట్టి రామయ్య గ్రహియించు। నెట్టొచెపుమ
నూరు చెల్లించి తగురసీ। దొరుకొనుట.

రంగనాథం :- (సంతోషముతో) మాష్టరుగారు! ఇక మన ప్లాను ఫస్టుగా ఫలించిందన్నమాటె. ఏమంటారా? ఈ ఉత్తరమూ మన చేత చిక్కియున్నది. ఆ డబ్బునకా మనం రసీ దియ్యలేదు. ఇకను రామయ్యా మనం డబ్బుహరించినట్లు ఏమి ఆధారం చూపగలడు? మనపై ఏమిచర్య తీసికో గలడు? పైగా మనది అబద్ధాలకు అందె వేసిన చెయ్యండోయి.

పోస్టుమాష్టరు :- భేష్! రంగనాథం!

తే. నీవు చెప్పినదంతయు। నిక్కువంబు
పాఱె మనప్లాను దీనిని భంగపఱుప
హరిహరాదుల కలవియె। ఔర! చదువు
కొన్న, కొండపై నుండిన కోతి దిగదె.

రంగనాథం :- మాష్టరుగారు! ఇక నేను వెళ్ళివచ్చెదను. సెలవు. (నమస్కరించును.)

పోస్టుమాష్టరు :- మంచిది రంగనాథం!

[తెర వ్రాలును]

మొదటి అంకము సమాప్తము

—+—

# రెండవ అంకము

## మొదటి రంగము

### రైతు రామయ్యగారి యిల్లు

రామయ్య నులకమంచముమీద కూర్చుండి యుండును.

రామయ్య :- (తనలో) ఆ రీడిల్లుబంగారం గాను. ఈ మద్దినే ఓ వంద రూపాయలు వదిలించాడు. మల్లీ యిప్పుడు పుట్టిన బుడ్డోడికి పుట్టినరోజనీ ఎంటనే రావాలనీ తంతి తరిమాడు. ఈ పోట్టు లుంటం గూడ మాలావు సిక్కు_గానె ఉండదే! ఇంతకు అసులు మా ముసిల్దానికి బుద్ధిలేదులె. ఆడేఉంది గంద? నన్నొందుకు రమ్మని రాయించాల? పోకమోతే పిల్లది కన్నీళ్ళెట్టుకుంటది. పైగా ఆడు రెయిలుకాడికొచ్చి కూకుంటాననికూడ రాచాట్ట. అందుకని ఎల్దామా అంటె. ఈడ యగసాయప్పన్లు గొంతుమీాన కొచ్చి కూకుండయి. ఇదంతా నా పానానికొచ్చిపడ్డది. (ముందునకు చూచి) ఓ! ఎందుకో పయ్యోటుబేమ్మడు కుటుంబయ్య గోరు వత్తుండారే! రాయేబాబు రా! (మంచము మీాద నుండి లేచి) ఈడ ఈ మంచంమీాన కూకొబాబు. (మంచమును చూపి తాను క్రిందకూర్చుండును) బాబుగా రేమో పనిమీా నొచ్చారే?

కుటుంబయ్య :- ఏమిలేదు రామయ్యా! నీకు ఆ పీరు సాహెబు ఒక వంద రూపాయలు ఇవ్వాలటగా! వాడు అంత యివ్వలేను ఏదో కొంత తగ్గించి యిస్తానంటె నీవు కాదంటున్నావనీ, నేను చెప్పితే నీవు వింటావనీ, నన్ను రమ్మని బ్రతిమాలుతే వచ్చాను. అయితే వాడు యాభై రూపాయలకంటె ఇవ్వలేనన్నాడు. కాని నేనే చీవాట్లుపెట్టి ముప్పాతికైనా యివ్వకపోతే బాగుండదనిచెప్పి అంత వరకు వప్పించాను. పాపం వాడూ బీదవాడు. ఇంకా యింత నీతీ నిజాయితీ కలవాడు కాబట్టి ఆధారం లేనిదానికి ఆమాత్రమైనా ఇస్తానంటున్నాడు. అంతవరకు సంతోషంగా తీసుకో రామయ్యా వాడూ పిల్లా జల్లా కలవాడు. సంతోషిస్తాడు.

రామయ్య :- కుటుంబయ్యగోరు ! మీరు సెప్పినట్టు నిజంగా ఆడు నీతి మంతుడె. అయితే ఈ మద్దెన సెప్పుడు మాటలు యిని సెడ్డట్టు న్నాడు. ఏమంటావా ? ఓరోజున ఆణ్ణి డబ్బడిగితే మా సెడ్డగా మాటల్తూలాడు. అందుకాణ్ణి అంతగా పట్టుపట్టా. కాణి, లేకమో తే ఎంతైనా తీసుకోనేవాణ్ణె. ఇగను పెద్దోరు మీరు సెబుతున్నారు కామట్టి ఆపాతిక తోసేసుకుంటాను. సొమ్మిప్పియ్యండి. ఎన్నాలల్లో ఇత్తానంటున్నాడేంటి ?

కుటుంబయ్య :- ఎప్పుడో కాదు రామయ్యా! ఇప్పుడే యిస్తాడు. అడుగో వాడువాకిట్లోనే ఉన్నాడు. నీ ఎదుటకు రావటానికి వాడికి మొఖం చెల్లడం లేదు. పిలుస్తాను. (బిగ్గరగ) ఓరేయి పీరు ! పీరూ!

పీరుసాహెబు :- (వెలుపలనుండియే) హా! మహరాజ్! హాస్తుండ. హాస్తుండ. (లోనికి ప్రవేశించి రామయ్యను చూచి) సలాం రామాయాఖారు సలాం. ఆరోజ్కా బుద్ధీ ఘడ్డీ తిని మీకీ మాటల్తూలా. ఈ రోజ్కా మీమోహం సూట్టాన్కా పిగ్గా పడ్తుండ. నాకీ తప్పు షెమించండి రామాయాఖార్.

రామయ్య :-అయిపోయిందిగంద. ఆ యిసయం ఇంకెందుకు లేరాపీరు !

కుటుంబయ్య :- పీరూ! ఏది ఆపైకం ఇలా యివ్వు.

పీరుసాహెబు :- (బొడ్లోనుంచితీసి) హిద్గో మహరాజ్ ! హిద్గో. (అని కుటుంబయ్య చేతికి అందించును)

కుటుంబయ్య :- (అందుకొని లెక్కించి) ఇదుగో రామయ్యా! పైకం ఇది తీసికొని పైకం ముట్టినట్లు, పీరుసాహెబుకు ఒక చేఉత్తరం వ్రాయించి యివ్వు.

రామయ్య :- ఏంరా పీరూ! సేఉత్తరం కావాలంటావా ?

పీరుసాహెబు :- నాకీ హేమీ తెల్వాద్ రామాయాఖారు. (కుటుం బయ్యనుచూపి) హార్కీ పెప్పీనట్టు సేయండి మహరాజ్ !

కుటుంబయ్య :- పాపం పీరు అడుగలేదు రామయ్యా! నేనే వ్యవహార రీత్యా అట్లా ఉండటం మంచిదని చెప్పాను. పైగా మీ యిరువు

రకు మాట పట్టింపులు కూడ వచ్చియున్నాయి గనుక ఒక గుర్తు ఉండటం ఎవరికైనా మంచిదని నాఅభిప్రాయం.

రామయ్య :– చరేలే బాబు! మీకు తెలవం దేముండదీ? రాయండి ముద్ర రేత్తాను.

కుటుంబయ్య :– (జేబులోనుండి ఒక కాగితమును తీసి వ్రాయునట్లు నటించి) ఆ! ఇదిగో రామయ్యా! వ్రాయుట పూర్తియైనది. నీ ఎడమ చేతి బొటన వ్రేలికి ఆ బుడ్డి మసిపూసికొనిరా ముద్ర వేస్తువు కాని.

రామయ్య :– (వేలికి మసిపూసికొనివచ్చి) యాడ బాబు ముద్ర రే యాల్సింది ?

కుటుంబయ్య :– ఇదిగో! ఇక్కడ వెయ్యి. (ముద్రను వేయించి) రామయ్యా ఒకసారి చదువుతాను విను.

రామయ్య :– సదవకపోతే ఏంలే బాబు. మీరేమన్నా రాయటం శాత కాని వారైతేగ.

కుటుంబయ్య :– అట్లా అనకు రామయ్యా! వ్యవహారంపట్ల ఎవరికైనా జాగ్రత్త ఉండటం మంచిది. ఇదిగో చదువుతున్నా విను. 1955 సంవత్సరం ది 12 డిశంబరు తారీఖున రాజనాల రామయ్యగారికి షేక్ పీరు సాహెబు వ్రాయించియిచ్చిన చేఉత్తరం. (అని చదువుచుండగా)

రామయ్య :– (ఆశ్చర్యముగ) అదేంటిబాబు! పీరుగాడు నాకురాసి య్యటం ఏంటి ? ఏదో పొరపాటు పడ్డట్టుండారే! మల్లీ ఓసారి సూడండి.

కుటుంబయ్య :– (చూచుట అభినయించి ఆశ్చర్యముగ) అరెరే! పొర పాటు పడ్డాను రామయ్యా ? నీవు పీరుకు చేఉత్తరం వ్రాయించి యిచ్చినట్లు వ్రాయవలసినది వాడునీకు వ్రాయించి యిచ్చినట్లు వ్రాశాను. చూచావా ? ఎంతపొరపాటు జరిగినదో ? నా జీవితంలో ఇంతవరకు ఇటువంటి పొరపాటు ఎన్నడు జరుగలేదు రామయ్యా!

రామయ్య :- ఇప్పుడు ముంచకపోయిందే ముందిలే బాబు! ఓరిక్కైనా పొరపాటు వస్తాఉంటది. ఇంకోకాయితం రాయండి ముద్ద రేద్దాం.

కుటుంబయ్య :- సరె! తప్పేదేముంది. (ఈ కాగితమును మడచి జేబులో ఉంచుకొని మరియొక కాగితమును తీసి వ్రాయును.) రామయ్యా! ఈ సారి విను. 1955 వ సంవత్సరం ది 12 డిశంబరు తారీఖున షేక్ పీరుసాహెబునకు రాజనాలరామయ్య వ్రాయించి యిచ్చిన చేఉత్తరం. నీవునాకు ఇవ్వవలసిన చేబదుళ్ల బాపతు బాకి నూరురూపాయలకుగాను, ఈ రోజున పూర్తిపరిష్కారము క్రింద రూ 75-0-0 లు అక్షరముల డెబ్బది అయిదు రూపాయలు ఇచ్చినావు గనుక ముట్టినది. ఈ రద్దు బాకీ తప్ప ఇకను మన యిరువురి మధ్య ఏలాటి లావాదేవీలు లేవు. ఇది నా సమ్మతిన వ్రాయించియిచ్చిన చేఉత్తరం.

రాజనాల రామయ్య నిశాని

దస్తూరి ఆర్పుల కుటుంబయ్యది.

బాగావిన్నావా రామయ్యా!

రామయ్య:- మీరాతకు అడ్డేముంటది బాబు! ఇందాకేదో పొరపాటు పడ్డారుకాని మీకు సెప్పేదేంటి? మీ సేతికింద ఎన్నికాయితాలు నలిగుండయ్యో, ఇగను ముద్దరేయ మంటారా?

కుటుంబయ్య :- ఆ! ఇదిగో! ఇక్కడవెయ్యి. (రామయ్యచేత వ్రేలి ముద్ర వేయించి) ఇకవస్తాం రామయ్యా! (లేవబోయి మరల కూర్చొని) మరచాను ఇదిగో! ఇందాక పొరపాటు వ్రాసిన కాగితమును చింపివేస్తున్నాను. (జేబులోనుండి ఒకకాగితమునుతీసిచింపి పారవేయును.)

రామయ్య :- వడిసిన్లకు యిల్లు కాల్తయ్యా బాబు! ఆ కాయితం సింపెయ్యక పోతే ఏం? అదేం చేస్తది?

కుటుంబయ్య :- చేసినా చేయకపోయినా వ్యవహారం సరిగాఉండాలి. నాతోకూడిన పనంతా అంతె. వ్యవహారంపట్ల ఆహారంపట్లా మొగమోటం పనికిరాదు, వస్తాం రామయ్యా! (లేచినిలబడును.)

పీరుసాహెబు :— (లేచి) సలాం రామాయాఖాను సలాం. మీాకీ మన్సులో హేమీాపెట్టూకోకండి మహారాజ్ !

రామయ్య:— పెట్టుకోటానికి ఏముంది లేరా పీరు! ఎప్పటిమల్లె మాఇంటి కాడికి వచ్చిపోతా ఉండు. ఇదుగో పుగాక్కాడ. (పొగాకు కాడను రొండినుండి తీసియిచ్చును.)

పీరుసాహెబు:— (అందుకొని) సలాం మహరాజ్ సలాం. ఇఘా మేం హెల్లీ వఝాస్తాం. (కుటుంబయ్య పీరుసాహెబులు నిష్క్రమింతురు. రామయ్య వారిని సాగనంపి మరల తిరిగివచ్చుచు చూడక కాగితపు ముక్కలను త్రొక్కి)

రామయ్య:— (తనలో) అయ్యయ్యో! ఆ కుటుంబయ్యగోరు కాయితం సింపి ముక్క లీడే పారేసి ఎల్లాడే. ఆయనిల్లు బంగారంగాను. కాయితాలంటే సరసపతంటారే! ఆటిని తొక్కితే కల్లుపోతయ్యంటారే! ఏం చేస్తాను? సూడక తొక్కాను. (కాగితపు ముక్కలను ఏరి కళ్ళకద్దుకొని చూరులో దోపును.)

( తెరవ్రాలును )

## రెండవ రంగము

పీరుసాహెబు, కుటుంబయ్య ప్రవేశింతురు.

పీరుసాహెబు:— మహారాజ్! కుటుంభాయాఖాన్! మీార్నాకి షెప్పిం దొకటి శేషిం దొకటిగా హుండాదే?

కుటుంబయ్య:— నీ మొఖం ఏం చెప్పాను ఏమి చేశానురా ?

పీరుసాహెబు:— అదీ ఖాదండీ మహరాజ్! ఆరామాయాఖార్కి హీ డబ్బాయిచ్చీ, షే హుత్తారం రాయాలనీ షెప్పీ ఆయన్ మన్కీ బాకీహుండట్టు నోట్కూ రాహిస్తాన్నాగ్దా.

కుటుంబయ్య:— ఆరి నీ తెలివి తెల్లవార. ఇదేనా నీవు తెలుసుకున్నది·

పీరుసాహెబు:—హెట్లైబాబు ఓ ఖాగీతం రా షార్. దాన్కి తప్పూహున్నార్ మల్లీ ఓఖాగీతం రాషార్. నాకీహిచ్చార్.

హంతేగ! ఇఖామీర్ హేమిసేసారో హేము. నాకీ హేమీ తెల్వాద్.

కుటుంబయ్య:—ఒరేయి పీరు! నేను అక్కడచేసిన తంతంతా చెప్తా బుఱ్ఱకు బాగా ఎక్కించుకో. రామయ్యచేత మొదట వ్రేలిముద్ర వేయించిన కాగితమున్నదే చూచావు. అది ఆయన మనకు అయిదువేల రూపాయలు బాకీయున్నట్లు లోగడే వ్రాయించి యుంచిన ఫోర్జరీనోటు, రామయ్యకు దాన్నే తప్పుగా చదివి విని పించా. ఎందుకంటే రామయ్యచేత అసలు చేఉత్తరంకూడ వ్రాయించాలనే ఎత్తుతో. అయితే రామయ్యకు ఆ నోటునే చేఉత్తరంలాగ చదివి వినిపించితే చాలదా? ఇంకా ఈ చేఉత్తరం దేనికని నీకు సందేహం కలగవచ్చు. ఎందుకంటే ఇకముందు మనం ఈ ఫోర్జరీనోటుబాకీ రాబట్టుకొనుటకు రామయ్యమీద దావా వేయవలసివస్తే ఆయన ఇది ఫోర్జరీ నోటని కుటుంబయ్య పీరుసాహెబునకు వ్రాసిన చేఉత్తరంమీద వ్రేలిముద్ర వేయమని చెప్పి ఈ నోటుమీద వ్రేలిముద్ర వేయించి యుంటాడని ఆన్సరు పెడితే రామయ్య చదువురాని వాడగుటవల్ల ఒకవేళ కోర్టు నమ్మ వచ్చు. అప్పుడు మనం ఈ నిజమైన చేఉత్తరాన్ని కోర్టులో దాఖలుచేస్తే దానితో ఆన్సరు రద్దైపోతుంది. ఒకవేళ రామయ్య ఆ వ్రేలిముద్ర తనది కాదంటాడా? ముద్రల యగ్జామినర్లను పిలిపించి పరీక్షచేయిస్తా. ఇంకెక్కడి పోతాడు యీ రామయ్య.

పీరుసాహెబు:— కుటుంభాయాఖార్! హంతాభాగానే హుండాది, ఖానీ ఆరామాయాఖారు రొండూఖాగీతాల్ మీాన హేలీ ముద్దా రల్ హేయించాడని ఎెప్పితే?

కుటుంబయ్య.— చెప్పితే చెప్పనీ. మొదట పొరపాటున వ్రాసిన కాగి తమును నీ ఎదుట చింపానాలేదా? ప్రమాణంచేసి చెప్పమంట. రామయ్య ఎంతచదువురానివాడైనా నీతీ నిజాయితీ కలవాడు కాబట్టి అబద్ధాలకు అప్రమాణాలకు జంకుతాడు. నిజం చెప్పు తాడు. దానితో జడ్జిగారు మన పక్షాన డిక్రీయిచ్చి తీరుతాడు.

పీరుసాహెబు :- హాయి తెబాబు! మీరో ఖాగీతం పింపేశార్గా, ఇఘా మీర్ పెప్పినట్టు హెమిపేస్తార్!

కుటుంబయ్య :- ఏమిచేసేదేమిట్రా ? అసలు కాగితా లేమి కదపలేదు. రామయ్యకు మన మీద ఏమి అనుమానం కలుగకుండ ఉండేం దుకు ఒక చిత్తుకాగితాన్ని చింపివేశా, అంతే.

పీరుసాహెబు :- (ఆశ్చర్యముగ) హారె! మీకీ భగ్మంతుడ్ హెమ్మంటి తెల్వి హిచ్చాడ్ మహారాజ్! ఇఘా హీ దెబ్బాతో రామాయా ఖార్ మహీ మహీ హయ్యారన్నమాటే.

కుటుంబయ్య :- ఒరేయి పీరు! ఈ పరమ రహస్యాన్ని మాత్రం బయ టకు పోక్క నీకు సుమా! జాగ్రత్త! అదుగో ఎవరో వస్తున్నట్లలికి డవుతున్నది. ఇక నీవు వెళ్లు.

పీరుసాహెబు :- (పీరుసాహెబు నిష్క్రమించును.)

కుటుంబయ్య :- అమ్మయ్యా!

ఉ. నేటికి నెట్టులోయటుల
నేర్పున ఫోర్జరినోటుపైని ఆ
మోటును టక్కుజేసియును
ముద్రనుమెల్లన వేయునట్లుగా
నాటకమాడితిన్ నడుమ
నమ్మికతోడను పీరుఁబెట్టి. యీ
బూటకమైన నాటకము
ముంచునొ తేల్చునొ నన్ను పిమ్మటన్॥

( తెరవ్రాలును )

రెండవ అంకము సమాప్తము

# మూడవ అంకము

## మొదటి రంగము

### రైతు రామయ్యగారి యిల్లు

రామయ్య:— (మిక్కిలి విచారముతో) తలుసుకుంటె గుండెలు తరుక్కొపోతుండయి. యాభై గాదు వందగాదు అమ్మయ్యో! అయిదేల రూపాయలే. అయిదేల రూపాయలు! పగలనక - రేయనక, ఎండనక, వాననక, పుట్టనక - పామునక, నేను నా ఎద్దలు కట్టపడి శమటదీసేసి, తినీతినకా, కూడగట్టుకొన్న కూస్తె డబ్బును నూసి ఆ కుటుంబయ్యకు కల్లుగుట్టినయి గామోసు. లేకమోతే నామీన ఈ పోజ్జరీనోటు సుట్టిస్తాడా? (గుండెమీద చేయివేసికొని) అమ్మో! ఎంతపని సేశాడు? ఎంతపనిసేశాడు? అయిదేల రూపాయల్ని అమాంతంగా మింగసూస్తుండాడే! ఈ అన్నాయాన్ని ఆపేవారు లేరా? ఓరూ లేరా? ఓరూ లేకమోతే పైన బగమంతుడైనా లేడా? ఆయ నన్నీ సూట్టంలేదా? (సందేహముగ) ఏమొ! అట్టాసూస్తాఉంటే ఇట్టా ఎందుకు జరుగుద్ది? (సందేహనివృత్తిగ) ఏం ఎందుకు జరుగదు? ఆ బగమంతుడు నన్ను సదువుకోవద్దన్నాడా? నేనే సదువుకోనిఉంటే ఆ కుటుంబయ్యకు ఇట్టా సేయటానికి గుండె లుండేవేనా? ఎట్టా ఉంటయి? ఉండవు. ఉండవు. కామట్టి ఇదంతా నేను సదువుకోని బలితమయి యుండదది. ఇంకోరోన్ని అని ఏమి లాబం? ఏమిలాబం? (ఇంతలో రామయ్య అల్లుడు గోపాలరావు ప్రవేశించును. రామయ్య చూచి) ఏమిరోయిగోపాళం, ఉత్తర మెప్పు డందటం, ఎప్పుడురావడం? బుడ్డో డాళ్లుకుశాల గుండారా? రా! ఈడ యీ మంచంమీన కూకో. (అని వాల్చియున్న మంచమును చూపును)

గోపాలరావు.— (మంచముమీద కూర్చుండి) ఆ! అంతా కులాసాగానే ఉన్నారు మామయ్యా! నీవు వ్రాయించిన ఉత్తరం వారం రోజుల క్రిందటనే అందింది. కాని నాకు పరీక్షలయితేను వెంటనే రాలేక పోయినాను. సరే కాని మామయ్యా! నీ వేదో పెద్ద విచారంలో ఉన్నట్లు కనబడుతున్నావే? కారణమేమిటి?

రామయ్య :- (మరియొక మంచమును వాల్చుకొని కూర్చుండి. (విచారముతో) ఏమి సెప్పే దోయి గోపాళం! ఆపయ్యేటు బేమ్మడు కుటుంబయ్యుండాడే, ఏం సేశాడో సూశావా ?

గోపాలరావు :- (ఆశ్చర్యముగ) ఏం, చేశాడేమిటి ?

రామయ్య :- ఆడి తస్స గొయ్యా! నేనంటా ఆయనకాడ అయిదేల రూపాయలు అప్పు తెచ్చానంట. నా మీన ఓ ఫోర్జరీ నోటు సుట్టించాడు. ఈ మద్దెనే నాకు ఓ రిజట్టరీ ఉత్తరం పంపాడు. ఏమనంటే ? డబ్బు కడితేకట్టు. లేకపోతే డావా దాకల్ సేస్తానని. "ఇదేంట్రా! అన్నెం పున్నెం ఎరగనే" అని నాకేం తోసక, నీవు సదువు కున్నోడివిగందా. దీని కేమి సెబుతావోనని అరిజంటుగా రమ్మని గాయించా. చరేగాణి గోపాళం! ఈ మద్దెన నీకు పంపిన వంద రూపాయలు సేరిన య్యేంట్రా ?

గోపాలరావు :- (ఆశ్చర్యముతో) వందరూపాయ లేమిటి పంపట మేమిటి ? ఎందుకు పంపావు మామయ్యా!

రామయ్య :- (ఆశ్చర్యముతో నోటిమీద చేయివేసికొని) అవ్వా! ఇదేందిరా బాబోయ్! ఆ మద్దెన నువ్వు ఉత్తరం రాత్తివి గందా ? పైకం పంపమని.

గోపాలరావు :- నేను డబ్బు పంపమని వ్రాయలేదే ? ఆ ఉత్తరం నీకు ఎవరు చదివి చెప్పారు ? ఏది ఆ ఉత్తరం ?

రామయ్య :- ఆ డిల్లు బండలైతే, ఆ పోట్టు జవాణె సదివి సెప్పాడురా! ఆ ఉత్తరం యాడ పెట్టానో ఏమొ గ్నాపకం లేదే.

గోపాలరావు :- పోస్టు జవానా ఆ అంజయ్యేనా ?

రామయ్య :- కాదు కాదు. ఈ డెవడో రంగనాదమంట. కొత్తగ వచ్చాడు యీణ్ణించో!

గోపాలరావు :- నీవు ఆ డబ్బును ఆ పోస్టుజవానుకు చేతికిచ్చి పంపావా? లేక పోస్టాఫీసుకు వెళ్ళి పోస్టుమాష్టరుగారికి ఇచ్చి వచ్చావా ?

రామయ్య :– అవును. నేను సొంతంగానే ఎల్లి ఆ పోట్టుమేట్టరు సేతికే వందరూపాయల కాయతం ఇచ్చొచ్చా. పయిన పోట్టు కరుసుల కంటూ ఓ రూపాయన్నరకూడ తీసుకుండారోయ్.

గోపాలరావు :– అయితే పోస్టుమాష్టరుగారు నీకేమైనా రశీదిచ్చారా?

రామయ్య :– ఆయన నాకేం ఇయ్యా లేదు. సావా లేదు.

గోపాలరావు :– పోనీ. నీవు పైకం ఇచ్చేటప్పుడు అక్కడింకెవరైనా ఉన్నారా ?

రామయ్య :– ఓరూ లేరు. ఆ పోట్టు మేట్టరు జవాను దప్ప.

గోపాలరావు :– సరే! నీవేమీ తొందర పడకు మామయ్యా! ఆ విషయం నిదానం మీద విచారిద్దాం. అయితే ఆ కుటుంబయ్య గారు దావా చేశాడా ?

రామయ్య :– సేశాడేంటోయ్. ఇశార్న కూడ జరుగుతూ ఉంటేను. రేపటికి మల్లీ వాయిదా పడ్డది.

గోపాలరావు :– అట్లాగా! సరే కానీ, ఏమి జరుగుతుందో చూద్దాం.

రామయ్య :– గోపాళం! నిన్న యే యాలటప్పుడు వణ్ణం తినొచ్చావో ఏమొ పోదాం రా. (తాను లేచి లోనికి పోవును.)

గోపాలరావు :– (గడ్డము క్రింద చేయి ఉంచుకొని విచారముతో) అరెరే! ఎంత మోసము జరిగినది! ఎంత మోసము జరిగినది!

తే. చదువురాని మోటనియెంచి । యదనెఱింగి
నూరురూకలు కాజేసి । నారు భళిర!
ఇప్పు డీ కుటుంబయ్యప్లా । నిటులపన్నె
ఐదువేలను మ్రింగ పే । రాస జక్క॥

మామయ్య చెప్పిన దానిని బట్టి చూస్తే ఈ మోసములను ఋజువు చేయుటకు తగిన ఆధారము లేమియు కనుపించుటలేదు. దీనికంతకు మూలం మామయ్యకు అక్షర జ్ఞానము లేక పోవుటయేగదా? అయినను.

ఆ. నేడు వంచకులకు । కీడు కలుగకున్న,
సజ్జనులకు నపయ । శంబు తప్ప
కున్న రేపు దేవు । డూరక విడచునే
యచట నుచితరీతి । నణచకుండ॥

(లోపలనుండి గోపాళం! గోపాళం! అను పిలుపు వినబడును) ఆ! వస్తున్నా మామయ్యా వస్తున్నా. (నిష్క్రమించును.)

(తెరవ్రాలును)

## రెండవరంగము

### కోర్టుహాలు

జడ్జి, ప్లీడర్లు, వారి వారి నిర్ణీత స్థలములలో నాసీనులై యుందురు. ఒక బోనులో రామయ్యా మరియొక బోనులో కుటుంబయ్యా యుందురు.

జడ్జి :- ఏమి రామయ్యా! నీవీ కుటుంబయ్యాగారివద్ద అయిదు వేల రూపాయలు అప్పు పుచ్చుకొని వ్రాయించి యిచ్చిన ప్రాంశరీ నోటును "నేను వ్రాయించి యివ్వలేదనియు, అది ఫోర్జరీ నోటనియు" ఆన్సరు పెట్టి యుంటివిగదా? అది ఫోర్జరీ నోటనుటకు నీ వేమి ఆధారములు చూపగలవు?

రామయ్య :- సిత్తం బాబుగోరు! ఆ బగవంతుడిదయవల్ల నాకు పది గొర్ల బూమి ఉండది. పదియేల రొక్కముండది. నే నోర్కైనా పదిరూపాయలు అప్పు ఇత్తుంటాకాని నా జల్మలో ఇంతవరకు ఓరికాడ ఓపదిరూపాయలు అప్పు తెచ్చి నోటురాసిచ్చిన పాపాణ పోలేదండిబాబు! కామట్టి ఇది తప్పక ఫోర్జరీ నోటేనండి.

1 వ ప్లీడరు :- (లేచి) రామయ్యాగారు! మీరు భాగ్యవంతులే కావచ్చును. కాని ఈ ప్రపంచములో ఎంత ధనము కలవాడైనను ఏదియో యొక సమయమున అప్పు చేయకతప్పదు. ప్రభుత్వము లంతవాటికే అప్పు చేయుట తప్పుటలేదు. ఇక మీరు అప్పు చేయ లేదనడం చాల చిత్రంగా ఉంది.

2 వ ప్లీడరు :- అయితే మా క్లయింటైన రామయ్యగారు లోగడ ఎన్నడైనా అప్పు చేసి నోటు వ్రాసినట్లు మీరేదైనా ఆధారం చూపగలరా ?

1 వ ప్లీడరు :- ఇంకను ఏవియో చూపు మెందు కండి ? ఈ నోటు చాలదా ?

2 వ ప్లీడరు :- ఇటువంటి ఫోర్జరీ నోట్లను చూపుమని నేనడుగుట లేదండి.

1 వ ప్లీడరు :- ఇది ఫోర్జరీ నోటని మీకెలా తెలుసు ?

2 వ ప్లీడరు :- నాకు తెలియుట ఏమిటి ? ముందు ముందు తమకును తెలియగలదు.

జడ్జి :- ఇంతకు ఈ నోటు ఎలా పుట్టిందంటావు రామయ్యా !

రామయ్య :- ఆ నోటు ఎట్టా పుట్టిందో ఏమొ ; ఆ బగమంతుడికి తెల వాల బాబు. నా కేమి తెలవదండి. అయితే ఈ మద్దెన ఓ పని జరిగింది బాబయ్యా ! నాకు మా గామకాపరస్తుడు సేకు పీరు సాయెబు ఓవందరూపాయలు ఇయ్యాల్సుంటే ఈకుటుంబయ్యగోరు మద్యవర్తిగాఉండి ముప్పాతికరూపాయలు ఇచ్చేటట్టు పరిస్కారం సేసి ఆ డబ్బు నాకు ఇప్పించాడు. ఆ మైన నా సేత డబ్బు ముట్టినట్టు ఓ సేడుత్తరం రాయించి ఆడి కిప్పించాడు. ఆ సేడుత్తరం రాసే టప్పుడు ముంగలో కాయితం రాసి ఏలిముద్దర ఏపించాడు. మల్లీ ఆ సేడుత్తరం సెడి పోయిందని సెప్పి ఇంకో కాయితంరాసి ఏలి ముద్దర ఏపించి పీరుగాడి కిప్పించాడు. నాకు సదువురాదు కాబట్టి ఆ సందట్లో ఏమన్నా జేశాడేమోనండి బాబు !

1 వ ప్లీడరు :- (లేచి) అయితే రామయ్యగారు ! కుటుంబయ్యగారు మిమ్మేమైనా చేయుటకు ఇంతకు ముందు మీకును వారికిని ఏమైనా విరోధమున్నదా ?

రామయ్య :- అబద్ద మేడ సెప్పను బాబు ! ఆయనకు నాకు ఏమి ఇరోదం లేదండి.

2 వ ప్లీడరు :- ఏమి కుటుంబయ్యగారు! రామయ్యగారు చెప్పినట్లు మీరు, రెండు చేఉత్తరములను వ్రాశారా ?

కుటుంబయ్య :- ఔను వ్రాశానండి.

2 వ ప్లీడరు :- రెండు చేఉత్తరములు వ్రాయ వలసినంత అవసరం ఏమి కలిగిందండి ?

కుటుంబయ్య :- మొదట వ్రాసిన చేఉత్తరములో పేర్లు పొరపాటు పడినయి. అందువల్ల దానిని తీసివేసి మరియొకటి వ్రాశాను.

2 వ ప్లీడరు :- మీరు బాగా ప్రైవేటు చేస్తుంటారుగదా ? ఈ స్వల్ప మైన చేఉత్తరం వ్రాయడానికి మీరు అంత పొరపాటెలాపడ్డారు ?

కుటుంబయ్య :- ఏదో పరధ్యానంలోవుండి యుంటాను.

2 వ ప్లీడరు :- మీరా సమయమున అంత పరధ్యానంలో నుండి యుండుటకు కారణమేమైయుంటుందో ?

కుటుంబయ్య :- ఏమో, ఇప్పుడది నాకు జ్ఞాపకం లేదు.

2 వ ప్లీడరు :- సరే. మీరు ఒక చేఉత్తరం చెడిపోయిందని చెప్తున్నారే ఆ చేఉత్తరాన్ని ఏమి చేశారు ?

కుటుంబయ్య :- దానిని అప్పుడే ఆ రామయ్యగారి ముందే చింపి వేశానండి.

జడ్జి :- ఏమి రామయ్యా! కుటుంబయ్యగారు చెడిపోయిన చేఉత్తర మును నీ ఎదుటనే చింపివేసినాడట నిజమేనా ?

రామయ్య :- అవును బాబు! ఓ కాయితం సింపియేసినమాట వాత్తవ మేనండి.

1 వ ప్లీడరు :- ఇదుగో రామయ్యగారు! బాగా వినండి. కుటుంబయ్య గారు వ్రాసిన రెండు చేఉత్తరములలో చెడిపోయిన చేఉత్తరమును మీ ఎదుటనే చింపివేసినాడని, రెండవదానిని మీరుసాహెబునకు ఇప్పించినాడనీ, మీరే ఒప్పుకొనుచున్నారుగదా ? ఇకను వారు ఆ సమయములో మిమ్ము చేసిన మోసమేమంటారు ?

రామయ్య :- అదేంటో బాబు! ఆ జేసినాయనకు, ఆ బగమంతుడికి తెలవాలగాణి ఇంకోరికి తెలుసుద్ది బాబు!

జడ్జి :- (ఆలోచించి) కుటుంబయ్యగారు! రెండవతూరి వ్రాసిన చేఉత్తర మున్నదా ?

కుటుంబయ్య :- చిత్తం. దానిని అప్పుడే ఆ పీరుసాహెబునకు ఇప్పించి నానండి. ఉంటే అది అతని దగ్గర ఉండవచ్చండి.

జడ్జి :- ఏమి రామయ్యా! నీ తరపున ఇంకెవరైనా సాక్షు లున్నారా?

రామయ్య :- లేరు బాబు లేరు! నాకా బగమంతుడు దప్ప ఇంకోరు లేరు.

జడ్జి :- ఏమి కుటుంబయ్యగారు! మీా తరపు సాక్షులు వచ్చినారా ?

కుటుంబయ్య :- చిత్తం. హాజరులోనే ఉన్నారండి.

జడ్జి :- ప్యూన్! ముందా నోటు వ్రాసిన పెడదార్ల పేరయ్యను పిలువుము.

ప్యూను :- చిత్తం. (ద్వారము కడకు వెళ్ళి) పెడదార్ల పేరయ్యా! పెడదార్ల పేరయ్యా! పెడదార్ల పేరయ్యా! (అని బిగ్గరగ పిలచును)

పేరయ్య :- ఆ! వస్తున్నా వస్తున్నా.

ప్యూను :- తొందరగా రాండి. జడ్జిగారు పిలుస్తుండారు.

పేరయ్య :- (లోనికి ప్రవేశించి జడ్జిగారినిచూచి) నమస్కారమండి.

జడ్జి :- (తిరుగు నమస్కారసూచనగ తలనుఊపి) ప్యూన్! ముందా పేరయ్యగారిచే ప్రమాణము చేయించుము.

ప్యూను :- చిత్తం. (పేరయ్యను చూచి) పేరయ్యగారు మీారా బోన్లోకి పదండి.

పేరయ్య :- (బోనులోనికి వెళ్ళి నిలబడును)

ప్యూను :- (బోనుతలుపు వేసి) "దేవుని ఎదుట అబద్ధమాడను. అంతా నిజం చెప్తాను." అనండి.

పేరయ్య :- (ప్యూను చెప్పినట్లుగా) దేవుని ఎదుట అబద్ధమాడను. అంతా నిజం చెప్తాను. (అనును)

జడ్జి :- ఏమి పేరయ్యగారు! ఈ నోటు వ్రాసినది మీరేనా ?

పేరయ్య :- చిత్తం. నేనే వ్రాశానండి.

2 వ ప్లీడరు :- పేరయ్యగారూ! మీరు ప్రైవేటు చేస్తుంటారా ?

పేరయ్య :- నేను ప్రైవేటు చేయనండి.

2 వ ప్లీడరు :- మరి మీరేం చేస్తుంటారు.

పేరయ్య :- మాకు భూమి ఉన్నదండి. అందులో జిరాయితీ చేయించుకుంటూ ఉంటాను.

2 వ ప్లీడరు :- మీకు ఏ మాత్రం భూమి ఉన్నదండి ?

పేరయ్య :- ఇరవై ఎకరాలదాక ఉన్నదండి.

2 వ ప్లీడరు :- సరే. మీకును ఈ కుటుంబయ్యగారికిని ఏమైనా బంధుత్వ మున్నదా ?

పేరయ్య :- మాకు బంధుత్వమేమీ లేదండి.

2 వ ప్లీడరు :- మీకు భూమి ఉన్నదని చెప్పారే! మీ భూమికిని రామయ్యగారిభూమికిని కాడిగట్టేమైనా ఉన్నదా ?

పేరయ్య :- కొంత భూమికి కాడిగట్టున్నదండి.

2 వ ప్లీడరు :- అయితే ఎన్నడైనా గట్లదగ్గర గనుములదగ్గర మీకును రామయ్యగారికిని తగాదాలేమైనా వచ్చినయ్యా ?

పేరయ్య :- మాకు ఎప్పుడును తగాదాలు రాలేదండి.

2 వ ప్లీడరు :- అయితే మీరు జిరాయితీ చేసుకుంటూ కొద్దిగా ప్రైవేటుకూడ చేస్తూ ఉంటారన్నమాట.

పేరయ్య :- అబ్బెబ్బే! అసలు ఆ ప్రైవేటంటేనే నాకు వళ్లుమంటుంది. ఏమంటే? అది తప్పుడు వ్రాతలు వ్రాయిస్తుంది. తప్పుడు సాక్ష్యాలు చెప్పిస్తుంది. నిలువున కొంపలు కూలదోయిస్తుంది. అందువల్ల ఆ పనిమాత్రం నేను చేయనండి.

2 వ ప్లీడరు :- పేరయ్యగారు! మీ నిజాయితీకి చాల సంతోషంగా ఉంది. అయితే అలాంటివారు మీరు ఈ నోటెలా వ్రాశారు.

పేరయ్య :- నాకు బాగా తెలిసిన వారెవరైనావచ్చి, మీరు ఈ కాగితం వ్రాసిపెట్టాలని కోరితే అది వ్రాయదగినదని నాకుతోస్తే వ్రాసి పెడుతూ ఉంటాను. అంతేకాని అవకతవక మనుష్యులు వచ్చి అల్లరి చిల్లరకాగితములు వ్రాయమంటే మాత్రం వ్రాయను. ఈ రామయ్య కుటుంబయ్యలు, నాకు బాగా తెలిసినవారు, పెద్ద మనుష్యులు కాబట్టి వ్రాయమంటే వ్రాశాను.

2 వ ప్లీడరు :- అయితే పేరయ్యగారు! మీకు వ్రాయదగిన కాగితమని తోచి వ్రాసే దానికి ఫీజు ఏమాత్రం ఉంటుందండి?

పేరయ్య :- అలా ప్రతి ఫలం కోరి వ్రాస్తే, ఇకను ప్రైవేటుచేసినట్లే కదండి. అందువల్ల నేను మాత్రం తమలపాకు తొడిమ పుచ్చుకోను.

2 వ ప్లీడరు :- మరి రామయ్యగారు ఈ నోటు విషయం తన కేమీ తెలియదని ఇది ఫోర్జరీ నోటని అంటున్నాడే కారణ మేమంటారు?

పేరయ్య :- బాకీ ఎగవేయదలచుకొన్నవారు అట్లనక మరేమంటారు చెప్పండి.

2 వ ప్లీడరు :- ఔను కాని. రామయ్యగారికి మీ ఎదుటనే పైకం ఇవ్వబడిందా?

పేరయ్య :- నా ఎదుటనే ఇవ్వటం కాదండి. నేనే స్వయముగా లెక్క-పెట్టి యాభై వందరూపాయలకాగితాలు ఇచ్చానండి.

2 వ ప్లీడరు :- ఆ కుటుంబయ్యగారు ఏ మాత్రపు స్థితి పరులేమిటండి?

పేరయ్య :- భూమి కొద్దే కాని డబ్బు మాత్రం పాతిక ముప్పై వేల దాక ఉన్నదని వదంతండి.

జడ్జి :- పేరయ్యగారు! ఇకను మీ సాక్ష్యము చాలును. మీరు వెళ్ళ వచ్చును. (కుటుంబయ్యనుచూచి) కుటుంబయ్యగారు! మిగత సాక్షు లిద్దరు హాజరులో నున్నారా ?

కుటుంబయ్య :- చిత్తం. ఇద్దరు హాజరులోనే ఉన్నారండి.

జడ్జి :- ప్యూన్ ! మొదటిసాక్షియగు గుగ్గిళ్ళ గురవయ్యను పిలువుము.

ప్యూను :- చిత్తం. (ద్వారము కడకు వెళ్ళి) గుగ్గిల గురవయ్యా! గుగ్గిల గురవయ్యా! గుగ్గిల గురవయ్యా! (అని బిగ్గరగ కేకలు వేయును)

గురవయ్య :- (వెలుపలనుండియే) ఆ! ఆ! వస్తుండా! వస్తుండా!

ప్యూను :- తొందరగా బయలుదేరండి. జడ్జిగారు పిలుస్తుండారు.

గురవయ్య :- (కొంచె మాలస్యముగ గుగ్గిళ్ళబుట్ట నొకదానిని చేత బట్టుకొని లోనికి ప్రవేశించి బుట్టను క్రిందబెట్టి) దండాలు పెబువు లోరికి దండాలు.

2 వ ప్లీడరు :- ఏమి గురవయ్యా! ఇంత ఆలస్యము చేసితివి ? పాఠ మును నేర్చుకొనుచున్నావా ఏమి ?

గురవయ్య :- అబ్బో! మీ దంతా బలేగొడవగాఉండదే! నే నేమన్నా ఎలకటేరు మిసన్ననుకుండారా ? మీట నొక్కంగానె సార్టం య్యేందుకు. ఓ బొజ్జ గణపయ్యంత బొజ్జా నేను, కదలా లంటారా లేదంటారా ? (బుట్టను మరల తీసికొనును.)

జడ్జి :- ఏమి గురవయ్యా! ఆ బుట్ట ఏమిటి ? నీ వేమిటి? ఇదేమైనా కోర్టు అనుకున్నావా ? వీథి యనుకున్నావా ?

గురవయ్య :- బాబుగారు గోంపడితే నేనేం సెప్పేది ? ఇది నా గుగ్గిల బుట్ట. నేను కోమటి గురవయ్యను. తౌరు పిలిసిందాకా ఊరికే

కూకుంటే ఏం లాబం. ఓ పావలాడబ్బులన్నా వ_స్తయిగందా అని కూసిని గుగ్గీలు బేరాణికి తెచ్చుకుండా. (అంతా నవ్వుదురు.)

2 వ ప్లీడరు :- (నవ్వి) లాభములేని సెట్టి వరదన పోడన్నట్లు మంచి పనిచేశావు కాని ముందాబుట్టను బయటపెట్టిరా.

గురవయ్యా :- సి_త్త మండి సి_త్తం. తౌరి సెలవయ్యాక, ఇక తప్పుద్దా ? (బుట్టను తీసుకొని వెళ్ళి తిరిగి బుట్టలేకుండా ప్రవేశించును.)

జడ్జి :- ప్ర్యాన్ ! ముందా గురవయ్యాచేత ప్రమాణము చేయించుము.

ప్ర్యాను :- చి_త్తం. (గురవయ్యానుచూచి) గురవయ్యాగోరు ! ముందు మీరా బోన్లోకి పదండి.

గురవయ్యా :- అబ్బో ! అబ్బో ! ఇదేంది ? సి_త్తరంగా ఉండదే. నేనే మన్నా పెద్దపుల్లి అనుకుండావా ? చిమ్మానమనుకుండావా ? బోన్లోకి పొమ్మంటావు. ఈడుంటే నిన్నేం పీక్కో_తినన్లే. బయపడమోకు.

ప్ర్యాను :- (నవ్వి) అదికాదయ్యా ! కోరుటులో సాచ్యం సెప్పే వారంతా బోన్లోకి పోయి పెమాణంసేసి సాచ్యం సెప్పాల్సిందె. పద పద.

గురవయ్యా :- (కోపమును తెచ్చుకొని) ఏయి పీనూ ! మాటలు తిన్నంగారాణీ. నే నోరనుకుండావు. కోపమొ_త్తే మడిసినికాను. ఈ మద్దెలిట్టాగే ఓడు మాటల్తాలాడు. ఆడిరోజులు మంచియ్యె మా పెద్దోడు ఊల్లో లేక పొయ్యాడుగాని, ఉంటేనా ? ఆణ్ణి పక్క_లిరగ దన్నించి పంపేవాణ్ణి. అసులు నీ అబ్బగాడి చొమ్ము ఏంతీచుకుండానని పెమాణం సెయ్యమంటావు సెప్పూ ?

జడ్జి .- ఏమి గురవయ్యా ! నీ విషయము శ్రుతిమించి రాగమున బడు చున్నదే ! జాగ్ర_త్తగా మాట్లాడుము. చెప్పినట్లు చేయుము.

గురవయ్యా :- (భయము నటించుచు) సి_త్తం బాబుగోరు సి_త్తం. ఇగ తమురు ఎట్టా సెప్ప మంటె అట్టాగె సెప్తా. నా అబ్బగాడి చొమ్మేంకర్చుబాబు ! (ప్ర్యానువంకజూచి) సెప్పవోయి పీణూ ! సెప్పూ ! !

ప్ల్యాను :- "దేవుని ఎదుట అబద్ధ మాడను. అంతా నిజం చెప్తాను." అనండి.

గురవయ్య :- ఇదేనా నువ్వుసేయించే పెమాణం? ఇంకేంటో అనుకుండ. నేనసలు నువ్వు అబద్దమాడమన్నా అణ్ణుగా, మాఅత్తమ్మ సెప్పింది. అబద్దమాడమాకూ అబద్దానికి అయిదుగురు ఆడపిల్లలు పుడతార్రా అని. అప్పుడు నేను మా బావమర్దిగాడి నెత్తిమీన సేయిపెట్టి పెమాణంశేశా అబద్దమాణ్ణని. ఇంకెందుకాడ్తాను?

2 వ. ప్లీడరు :- గురవయ్యా! మంచిపని చేశావుకాని, ఈ నోటులో మొదటి సాక్షిగా సాక్ష్యముచేసినది నీవేనా ?

గురవయ్య :- సిత్తం బాబుగోరు! ఔననమంటారా? కాదనమంటారా? సెలవిప్పియ్యండి సెప్పూతాను.

జడ్జి :- ఏమి గురవయ్యా! ఇది పరిహాసమనుకొను చుంటివా?

గురవయ్య :- అనుకోలేదుబాబు అనుకోలేదు. ఇందాక తమురు సెలవిచ్చారుగా సెప్పినట్టు సెయ్యమని. నాయిట్ట మొచ్చినట్టు సెప్పితే బాబుగారికేం కోపం వచ్చుద్దోఅని అడుగుతుండా.

2 వ. ప్లీడరు :- ఏమి కుటుంబయ్యగారు! మంచిసాక్షినే సంపాదించినారే?

గురవయ్య :- (సంతోషమును నటించుచు) అద్దదీ! బాబుగారు మంచి సదువుకునోడు గామట్టి శటక్కున తెల్సుకుండాడు. నేను మంచోణ్ణని. ఇంకోమట్టిబుర్రోడైతే ఏం తెల్సుకుంటాడంటా?

2 వ. ప్లీడరు :- చాలుచాలు గురవయ్యా! నీ తెలివికి చాల సంతోషిస్తున్నాం.

గురవయ్య :- దండాలు పీడరుగారు దండాలు. నాఈతెలివికి దగినట్టు ఆయదవసచ్చినోడు మాఅయ్య నాకు సరిగ్గాసదువు సెప్పించలేదు కాణీ, లేకపోతే ఓ ఎలుగు ఎలక్క పొయ్యానా బాబూ!

జడ్జి :- ఏమి కుటుంబయ్యగారు ఇంత మతిలేని మనిషిచే మీ రెలా సాక్షిగా సాక్ష్యము చేయించితిరి ?

కుటుంబయ్య :- చిత్తం. ఆ సమయమునకు ఈ గురవయ్య అచట ఉండుటవలన సమక్షములో లేని సాక్ష్యముకంటె మేలుగదాయని ఇతనిచే సాక్ష్యము చేయించితిని. కాని ఇతను ఇంత అవివేకి యని మాత్రం అనుకోలేదండి.

జడ్జి :- కుటుంబయ్యగారు ! ఇతనిని నేను సాక్షిగా అంగీకరించుటలేదు. (గురవయ్యను చూచి) గురవయ్యా ! ఇకను నీవు ఇంటికి వెళ్ళ వచ్చును. (కుటుంబయ్యవాండ్లను చూచి) ఈ కేసును రేపటికి వాయిదా వేయుచున్నాను. కుటుంబయ్యగారు ! మీరు మాత్రం ఆ చేడత్తరమును మీ మిగత సాక్షులను రేపు తప్పక కోర్టుకు హాజరు పరచండి. ఇకను అందరు వెళ్ళవచ్చును. (తెరవాలును.)

(మరల వెంటనే తెర ఎత్తబడును. గురవయ్య ప్రవేశించును)

గురవయ్య :- (తనలో) అమ్మయ్యా ! ఎట్టా గోట్ట ఈ గండం గడిసి బయటపడ్డా. లేక మోతే నేను సెప్పినట్టు సాచ్యం సెప్పక పొయ్యావా ? నీ పని ఏ మవుద్దో సూసుకోమని అటు ఆ కుటుం బయ్యా, ఊళ్లో ఉండదలసుకుంటే నేను సెప్పినట్టు సాచ్యం సెప్ప మని ఇటు ఈ గోపాళరావు బెదిరిస్తా ఉండారు. ఎటేమి సెప్పితే ఏం కొంపమునుగుద్దో అని.

తే. ఏమి సెప్పను తోసక । ఏమిటోను
కుడితిలో పడ్డ ఎలికల్లె । కొట్టుకోని
అట్ట పిచ్చోడి మల్లెను । ఆటలాడి
తప్పుకొంటిని నేనిదే । ముప్పునుండి॥

కావట్టి ఇగను నా జల్మలో కొమ్ములు తిరిగినోడొచ్చి కాళ్ళట్టుకోని బతిమాలుకున్నా సాచ్యాం మాత్రం సస్తే సేయను. ఇప్పుడే ఒట్టేసు కుంటుండ. సాచ్యం సేసినాడు ఆలయ్యాకు పుట్టినట్టె. (ప్రక్కలకు చూచి) అమ్మోబాబోయ్ ! చమయానికి కుటుంబయ్యగోరు ఇటే

వస్తుండాడే. ఇప్పు డాయన కంట పడకూడదు. నేను ఈ గొందిన ఎల్తాను. (నిష్క్రమించును.)

(తెర వ్రాలును)

## మూడవ రంగము

### పోలీసుస్టేషను

సబిన్స్పెక్టరు ఫైలుచూచుకొనుచుండును. గోపాలరావు ప్రవేశించును.

గోపాలరావు :- గుడ్ మార్నింగ్ సార్ !

సబిన్స్పెక్టరు :- (ముందుకు చూచి) ఓ గుడ్ మార్నింగ్ గోపాల్ రావు. కమాన్· కమాన్. టేక్ దట్ ఛైర్. ఎప్పుడు రాక.

గోపాలరావు :- (కుర్చీలో కూర్చుండి) మొన్న రాత్రి మెయిల్ కొచ్చానండి.

సబిన్స్పెక్టరు :- వాటార్యూరీడింగ్ నౌ మిష్టర్ గోపాల్ రావు ?

గోపాలరావు :- బియ్యే సెకండియర్ సార్ !

సబిన్స్పెక్టరు :- వెరీవెల్ ! ఏమిటి విశేషాలు ?

గోపాలరావు :- ఒక వింతైన విశేషం మీకు చెప్పవలెననే వచ్చానండి. ఏమంటే ? ఇటీవల మన పోష్టుమాష్టరుగారు, జవానూకలసి మా మామగార్ని చాల న్యాక్ గా మోసంచేసి నూరురూపాయలు కాజేశారండి.

సబిన్స్పెక్టరు :- ఓ ! ఆ రాజనాల రామయ్య గార్నా ? ఏమిటా మోసం ? ఏం చేశా రేమిటి ? నా కేమీ తెలియ లేదే !

గోపాలరావు :- ఇంతవరకు ఆ విషయం, ఎవరికి తెలియదు లేండి. తెలియటానికిగూడా అవకాశము లేదు. ఏమంటే నేను 3-10-55 వ తేదీన క్షేమసమాచారాలు తెలుపవలసినదిగా మా మామగారికి ఒక లెటరు వ్రాశాను. దానిని పోస్టుజవాను తెచ్చి మా మామ గారికి ఇచ్చాడట. ఆయనకు చదువురాదు. నిశానీదారు. మీకును తెలిసే ఉందిగ. అందువల్ల ఆయన ఆ జవాన్నే చదివి చెప్ప

మన్నాడట. అతను "మీ అల్లుడు గోపాలరావు అర్జంటుగా వందరూపాయలు పోస్టుద్వారా పంపమని వ్రాశాడని" చెప్పాడట. అది ఆయన నమ్మి నూరురూపాయలు తీసికొని వెళ్ళి పంపమని పోస్టుమాష్టరుగారిచేతికి ఇచ్చి వచ్చాడట. నేను నిన్న వస్తే డబ్బు పంపాను చేరిందా అన్నాడు మా మామయ్య. నాకేం తెలుస్తుంది. డబ్బేమిటయ్యా అంటే ఈ విషయం చెప్పాడు. చూచారా వాళ్లెంత మోసం చేశారో ?

సబిన్స్పెక్టరు :– (ఆశ్చర్యముగ) అరె !! ఈ దొంగతనం చాల వన్డర్ఫుల్‌గా ఉందే. దీనికేమైనా ఆధారముందా గోపాలరావు ?

గోపాలరావు : నాకేమీ ఆధారం కనబడలేదండి.

సబిన్స్పెక్టరు :– మరి ఎలా ఈ కేసును రుజువుచేయడం ?

గోపాలరావు :– చాల కష్టమేనండి. కాని మీరు వారిని పిలిపించి మందలిస్తే ఏమైనా బయటపడుతుందేమోనని నా ఆశ.

సబిన్స్పెక్టరు :– అయితే నీవు 3–10–55 వ తేదీన జాబు వ్రాశానని చెప్పున్నావే సరిగ్గా ఆ తేదీనని నీకెలా జ్ఞాపకం ?

గోపాలరావు :– జ్ఞాపకంకాదండి. నేను మామూలుగా ఎవరికి లెటరు వ్రాసినా తప్పకుండ పోస్టల్ సర్టిఫికెట్ తీసుకుంటూ ఉంటాను. ఇదుగో ఆ సర్టిఫికెట్ నాదగ్గరే ఉన్నదండి : (తన నోటు పుస్తకములో నుండి తీసి యిచ్చును)

సబిన్స్పెక్టరు :– (సర్టిఫికెట్‌ను చూచి) వెరిగుడ్ ! నీకు చాల మంచి అలవాటున్నది గోపాలరావు. (ఆలోచనగ) అయితే నీవు 3–10–55 వ తేదీన లెటర్ను పోస్టుచేశావన్నమాట. అది ఈ పోస్టాఫీసుకు 4–10–55 వ తేదీన చేరి ఉండాలి. అంతేగ.

గోపాలరావు :– యస్. సార్ !

సబిన్స్పెక్టరు :– సరే. వాళ్ళను ఇప్పుడే పిలిపించి విషయం కనుక్కుందాం. (బిగ్గరగ) ఏయ్ ! ఫోర్ నాట్ ఫైవ్ !

కానిస్టేబులు :- (ప్రవేశించి శాల్యూట్ చేసి) చిత్తమయ్యా !

సబిన్స్పెక్టరు :- నీవు తక్షణమే వెళ్ళి పోస్టుమాష్టరును, జమాను రంగనాథాన్ని నేను పిలుస్తున్నానని చెప్పి వెంటబెట్టుకొనిరా.

కానిస్టేబుల్ :- చిత్తం. (శాల్యూట్ చేసి నిష్క్రమించును.)

సబిన్స్పెక్టరు :- గోపాల్ రావు ! నిజముగా మన దేశములో చదువు చాల తక్కువగావున్నది. అందువల్లనే ఇటువంటి మోసాలు తరచుగా జరుగుతూన్నాయి. మాకు వచ్చే కేసుల్లో నూటికి తొంభై ఇటువంటివే.

గోపాలరావు :- ఔను సార్ ! మీరు చెప్పినట్లు మన దేశంలో ఎడ్యుకేషన్ - చాల తక్కువేనండి. కాని ఇప్పుడిప్పుడు మన ప్రజా ప్రభుత్వంవారు విద్యాభివృద్ధికి పాటుపడుతూ ఉన్నారు. విద్య కొరకు ఎంతో ధనం వెచ్చించుచున్నారు.

సబిన్స్పెక్టరు :- ఏ పాటుపడినా ఎంత డబ్బు ఖర్చుచేసినా, ముందు ప్రజలలో విద్యయందు అభిరుచి ఏర్పడాలి గోపాలరావు !

గోపాలరావు :- యస్ సార్ ! (ఇంతలో పోస్టుమాష్టరు, జమాను రంగనాథం, కానిస్టేబులు ప్రవేశింతురు)

పో - మా, జమాను :- (సబిన్స్పెక్టరును చూచి) నమస్కారమండి.

సబిన్స్పెక్టరు :- (తిరుగు నమస్కారసూచనగ తలనుఊపి) అలా ఆ బల్ల మీద కూర్చోండి. (పోస్టుమాష్టరు బల్లమీద కూర్చుండును. జమాను ప్రక్కన నిలబడియుండును.) ఏం మాష్టరుగారు ! మీ పోస్టాఫీసునకు 4-10-55 వ తేదీన రాజనాల రామయ్యగారి పేర ఒక జాబు వచ్చి ఉండాలి. వచ్చిందా ?

పోస్టుమాష్టరు :- (ఆలోచన నటించి) ఆ తేదీన వారి కేమీ జాబు రాలేదండి. ఇటీవల మాత్రం ఒక టెలిగ్రామ్ వచ్చింది. దానిని వారికి అప్పుడే పంపాను.

సబిన్స్పెక్టరు :- నిజంగా ఆ తేదీన వారికేమీ జాబురాలేదంటారా ?

పోస్టుమాష్టరు :- తమతో అబద్ధమాడగలనా ? రాలేదండి.

సబిన్స్పెక్టరు :- (తలనుఊపి హేళనగ) ఔను రాలేదులే. నాకూ తెలుసు. (రంగనాథమునుచూచి) ఏమి రంగనాథం ! ఉత్తరములు బట్వాడా చేసేది నీవే కదా ? ఆ తేదీన రామయ్యాగారికి జాబేమీ రాలేదా ? బాగా ఆలోచించి చెప్పు.

రంగనాథం :- (భయమును నటించుచు) అయ్యాగారు ! ఆ తేదీన వారి కేమీ జాబు రాలేదండి. నాకు బాగా జ్ఞాపకమేనండి.

సబిన్స్పెక్టరు :- (తలను ఊపి) ఊహూ ! అయితే సరే! (పోస్టు మాష్టరును చూచి) ఏం మాష్టరుగారు ! ఉత్తరం మాట అలా ఉంచండి. రామయ్యాగారు ఈ గోపాలరావుకు పంపమని మీ చేతికి నూరు రూపాయలు ఇచ్చినాడటగదా పంపినారా ? లేక తమ ఖాతాలో జమ కట్టుకున్నారా ?

పోస్టుమాష్టరు :- (ఆశ్చర్యమును నటించుచు) ఇన్స్పెక్టరుగారు ! ఈ విషయం, ఇంకా ఆశ్చర్యంగా ఉన్నదండి. ఆ రామయ్యాగారేమిటి నా చేతికి వందరూపాయలిచ్చి పోవటమేమిటి ? (ముక్కు మీద (వేలు వేసికొని ) అరెరే! ఎంత అభూతకల్పన ! ఎంత విచిత్రం !

సబిన్స్పెక్టరు :- (తలను ఊపి) ఔనౌను. ఈ విషయం ఎలా బయట పడిందా అని నీకు విచిత్రంగానె ఉంటుందిలే. (కోపముతో) అంకు నేర్చినది బొంకు నేర్వదా అన్నట్లు తప్పును కప్పిపుచ్చుకొనటానికి ఈ కపట నాటక మాడుతున్నావా ? ఇకను నీ కపట వేషములు కట్టిపెట్టి నిజముచెప్పు. మర్యాదను కాపాడుకో. చేసిన తప్పు ఊర కనే పోవుననుకొనుచుంటివా ? బాగా ఆలోచించుకో. ఇంకనూ కొంతకాలం ఉద్యోగమును నిల్పుకొని గౌరవంగా బ్రతుకు. జాగ్రత !!

పోస్టుమాష్టరు : (భయముతో) ఇన్స్పెక్టరుగారు ! మీరు అలా సెల విస్తే నే నేమి చెప్పేది ? ఆ దైవసాక్షిగా నాకేమీ తెలియదండి.

సబిన్‌స్పెక్టరు :– (కోపముతో) ఏమి రంగనాథం! నీ సంగ తేమిటి? ఉన్న వాస్తవమును మాటలతో చెప్పదలచుకొనలేదా ఏమి? (కొంచెం మాగి) ఊ! సమాధానం చెప్పవేం?

రంగనాథం :– (భయముతో వణకుచు) అయ్యా! మీరు ఏ ప్రమాణం చెయ్యమంటే ఆ ప్రమాణం చేస్తాను. ఆ ఉత్తరం విషయం డబ్బు విషయం నాకేమీ తెలియదండి. ఇకను తమరు నన్ను ఏమి చేసినా సరే. నా ప్రమాణ పూర్తిగా నా కేమి తెలేదండి.

సబిన్‌స్పెక్టరు :– (తలను పంకించి) అయితే యింతేనా? ఇకను సరె! నేను ఈ కేసును గురించి తీవ్రముగ దర్యాప్తు జరిపెదనుసుమా? మీరు మోసము చేసినట్లు ఏ మాత్రమైనను ఆచూకీ చిక్కినదా మిమ్మల్ని హతమార్పక మానను. నా పేరు సుబ్బయ్యపంతులని మఱువకండి. బాగా ఆలోచించుకోండి. తెలిసిందా? ఇకను వెళ్ళండి. (ఇరువురును నిష్క్రమింతురు) ఏమి గోపాలరావు! చూచావుగ ఇంతకంటె వారిని మన మేమి చేయగలం?

గోపాలరావు :– ఔను సార్! ఏమీ సాక్ష్యము లేని దానికి మీరు మాత్రం ఏమి చేయగలరు? (లేచి) నమస్తే.

సబిన్‌స్పెక్టరు :– నమస్తే!

(తెర వ్రాలును)

## నాల్గవ రంగము

### ఒకటవ ప్లీడరుగారియిల్లు

ప్లీడరు, లా పుస్తకములను చూచుకొనుచుండును. కుటుంబయ్య ప్రవేశించును.

కుటుంబయ్య :– నమస్కారమండీ ప్లీడరుగారు!

1 వ. ప్లీడరు :– (చూచి తిరుగునమస్కారముచేసి) రాండి కుటుంబయ్య గారు. ఇలా ఈ కుర్చీలో కూర్చోండి. (కుటుంబయ్య కుర్చీలో కూర్చుండును.) అదేమిటండి? మొన్న మన మా గురవయ్యకు సాక్ష్యమెలాచెప్పాలో చిలక్కు నేర్పినట్లు నేర్పాంగదా? నిన్న అతను ఎందువల్ల అలాపిచ్చివాడిలాగ నటించి మంచి పటుత్వంగా

నడిచే కేసును పాడుచేశాడు? మీరు అతనికి ముట్టచెప్తామన్న దాంట్లో ఏమైనా . . . ?

కుటుంబయ్య :- ఎబ్బెబ్బే! అలాంటి దేమీ లేదండి. అనుకున్న ప్రకారం అరనంద అప్పుడే యిచ్చేశాను.

1 వ ప్లీడరు :- అలా అయితే అతను ఎందువల్ల సరియైన సాక్ష్యం చెప్పలేదంటారు ?

కుటుంబయ్య :- అదే నాకూ అర్థం కావడం లేదండి. అయితే నాకో అనుమానం కలుగుతూ ఉంది.

1 వ ప్లీడరు :- మీ అనుమాన మేమిటంటారు ?

కుటుంబయ్య :- ఏమీ లేదు. ఆ రామయ్యగారి అల్లుడు గోపాలరావు ఉన్నాడే, ఈ కేసును నాశనం చేయాలనే ఎత్తుతో ఒక వేళ ఈ గురవయ్యను పిలిపించి ఏమైనా చేస్తానని బెదిరిస్తే, ఇతను భయపడి అలా పిచ్చివానిలాగ నటించి సరియైన సాక్ష్యం చెప్పక తప్పించుకొని ఉంటాడేమోనని నా అనుమానం. అయితే కోమటి బిడ్డ కాబట్టి యుక్తిగా ఉభయత్ర మాటరాకుండ తప్పించుకున్నాడు.

1 వ ప్లీడరు :- (ఆలోచించి) ఔను. మీరు చెప్పింది రైటే కావచ్చు. అటువంటి ఎత్తులలో అతను అసాధ్యుడే. ఇటీవల అతని మామ గార్ని మోసంచేసి డబ్బు కాజేశారనే నెపంతో, పోస్టుమాష్టరును, జమానును, సబిన్స్పెక్టరు దగ్గరకు పిలిపించి నానాచీవాట్లు పెట్టించాడట కూడ. ఏది ఎట్లయినను గ్రుడ్డికంటె మెల్ల నయ మన్నట్లు గురవయ్య సరియైన సాక్ష్యం చెప్పినను చెప్పకపోయినను కోర్టుకు రావడం మంచిదే. మీరుకూడ అతని సాక్ష్యమును చాల బాగా సమర్థించారు. అతనే గనుక అసలు కోర్టుకు రాకపోయినట్లయితే జడ్జిగారికి ఈ కేసును గురించి కొంచెం అనుమానం వేసేది.

కుటుంబయ్య :- అయితే ప్లీడరుగారూ! ఇప్పటికి జరిగిన విచారణను బట్టి మన కేసులో జయాపజయాలు ఎలా ఉంటయి అంటారు?

1 వ ప్లీడరు :- ఇంకా మీకు అనుమానమేనా? ఎలా ఉండేదేమిటి ? ఇక మన కపజయం తప్పదంటే నమ్మండి.

కుటుంబయ్య :- (నివ్వెఱపడి) ఇదేమిటండోయి! మన కపజయం తప్పదంటున్నారేమిటి ?

1 వ ప్లీడరు :- (నాలుక కరచుకొని) పొరపాటు పొరపాటు. "వారి కపజయం తప్ప" దనవలసింది "మన" కన్నాను. అంతేగాని వేరే ఏమీలేదు. దీనిని గురించి మీరు మనస్సులో అట్టే అందోళన పడకండి. ఇదేమీ ఆ, సత్యకాలం కాదులెండి. అయితే మరచాను. ఆ పీరుసాహెబు కూడ ఈ గురవయ్యా చేసినట్లు చేయడు గదా ?

కుటుంబయ్య :- అతను అలా చేయడులెండి. సాక్ష్యం మాత్రం అమోఘంగా చెప్తాడు. అందుకేమీ సందేహం లేదు. అతను ఒకరి మాట విని లొంగిపోయే ఘటం కాదు. పైగా ఈ కేసులో అతనికి కూడ బాధ్యత ఉన్నది లేండి.

1 వ ప్లీడరు :- మీరు పీరుసాహెబున కేదో ప్రత్యేక బాధ్యత ఉన్నట్లు మాట్లాడుతున్నారే? ఏమిటది ?

కుటుంబయ్య :- ఉన్నది లేండి. అయినా మీకు చెప్పకపోవట మెందుకు ? (ప్రక్కలకు చూచి రహస్యముగ) ఈ నోటులో అతనికికూడ భాగమున్నదండీ.

1 వ ప్లీడరు :- ఓహో! అదా విషయం? అయితే ఇంకా ఏం? గెలుపు మనదనటానికి అనుమానమేమున్నదండీ?

కుటుంబయ్య :- ఏమీలేదు. ఇందాకమీరు అలా అంటేను నాగుండె ఝల్లుమన్నది.

1 వ ప్లీడరు :- ఆ! అదేమిటిలేండి. మాట పొరపాటురావడం మానవసహజమేగా! దానికి మీరేమీ కలవరపడకండి. (మెల్లగా) అయితే ఇందులో పేరయ్యగారికెక్కడ వాటాయేనా?

కుటుంబయ్య :— లేదులేదు. ఒక్కవందమాత్రం ఇస్తానన్నాను. అంతే.

(ఇంతలో పేరయ్య ప్రవేశించును.)

పేరయ్య :— (ప్రవేశించి) నమస్కారమండి ప్లీడరుగారు!

1వ ప్లీడరు :— రాండి రాండి పేరయ్యగారు! సరిగ్గా మీకు నూరేండ్లాయుర్దాయం. అలా ఆ కుర్చీలోకూర్చోండి. ఇప్పుడే ఏవో మాటలమీద మీమాట వస్తేను అనుకుంటున్నాం. ఏదో పని మీద వచ్చారే?

పేరయ్య :— ఏమీలేదు. కుటుంబయ్యగారితో మాట్లాడి పోదామని వచ్చాను.

కుటుంబయ్య .— ఏమిటివిశేషం పేరయ్యా?

పేరయ్య :— ఏంలేదు. నేను ఇటునుంచి ఇటు మా అమ్మాయిగారి ఊరికి వెళ్లివద్దా మనుకుంటున్నాను. అందుకు మీతో మాట్లాడి పోదామని వచ్చాను.

కుటుంబయ్య :— డబ్బు విషయమేగా! ఇప్పుడే ఇస్తాను. కాని నీవు ఈ పూటకు ఉండు. ఇవ్వాళే మన కేసును గురించి తప్పక తీర్పు చెప్తారు. విని వెళ్లుదువుగాని. కోర్టు వేళ కావచ్చింది వెళ్లుదాం.

1 వ ప్లీడరు :— (చేతి గడియారమును చూచి) ఔనండి. మీరన్నట్లు టైమ్ కావచ్చింది. ఇకను మీరు వెళ్ళి త్వరగా భోజనం చేసి కోర్టు దగ్గరకు రాండి. ఆ పీరు సాహెబు వచ్చి ఉంటాడు గదా!

కుటుంబయ్య :— ఆఁ! వచ్చే ఉంటాడు. ఇక మేమొస్తా మండి. (నమస్కరించును.)

1 వ. ప్లీడరు :— (తిరుగు నమస్కారము చేసి) మంచిది త్వరగారాండి.

(తెర వ్రాలును.)

# అయిదవ రంగము.

## ( కోర్టు హాలు. )

(జడ్జి, ప్లీడరు, వాది ప్రతి వాదులు వారి వారి స్థానములలో నుచితరీతి నుందురు.)

జడ్జి :– ఏమి కుటుంబయ్యా గారు! ఆ చేఉత్తరమును తెచ్చినారా ?

1 వ ప్లీడరు:– చిత్తం ఇదుగోనండి. ఆ చేఉత్తరం నా దగ్గర ఉన్నది. (ఫైలులోనుండి తీసి ఇచ్చును.)

జడ్జి :– (ఉత్తరమును తీసికొని పరిశీలించి) సరే! ఏమి కుటుంబయ్యా గారూ! మీ రెండవసాక్షియగు షేక్ పీరుసాహెబ్ వచ్చినాడా ?

కుటుంబయ్య :– చిత్తం. హాజరులోనే ఉన్నాడండీ.

జడ్జి :– ప్యూన్! షేక్ పీరుసాహెబును పిలువుము.

ప్యూను :– చిత్తం. (ద్వారముకడకు వెళ్ళి బిగ్గరగ) సేకు పీరుసాయెబూ! సేక్ పీరుసాయెబూ! సేక్ పీరుసాయెబూ! (అని పిలుచును.)

పీరుసాహెబ్ :– (వెలుపలనుండియె) హా! హాొస్తుండా బాబూ హాొస్తుండ. (లోనికి ప్రవేశించి జడ్జిగారిని చూచి) సలాం మహారాజ్! సలాం.

జడ్జి :– ప్యూన్! ముందా పీరుసాహెబుచేత ప్రమాణము చేయించుము.

ప్యూను :– చిత్తం. (పీరుసాహెబును చూచి) పీరుసాహెబుగారూ మీరా బోన్లోకి పదండి.

పీరుసాహెబు :– (బోనులోనికి వెళ్ళి నిలబడును.)

ప్యూను .– (బోను తలుపును వేసి) "దేవుని ఎదుట అబద్ధమాడను. అంతా నిజం చెప్తాను." అనండి.

పీరుసాహేబు :- (ప్ల్యాను చెప్పినట్లుగా) ధేముడిహెద్ట హాబద్ధం హాడన్, హంతా నిజం హెప్పేస్తాన్.

జడ్జి :- ఏమి పీరుసాహెబ్ ! ఈ కుటుంబయ్యగారివద్ద ఆ రామయ్య అప్పు తీసికొని నోటు వ్రాయించి యిచ్చినప్పుడు నీ వచట ఉంటివా ?

పీరు సాహెబు :- షిత్తం మహారాజ్ ! హక్కాడే హుండాన్.

2 వ ప్లీడరు :- నీ వా సమయమున అక్కడెందు కుంటివి ?

పీరుసాహెబు :- మహారాజ్ ! హామల్ నాకీ రామాయాఖారీతో పనీ హుండీ ఆరి హింటికీ హెల్లాన్. ఆరు హాడా లేకపోతే హారి జీతాఖాడ్కీ హాడ్గాన్. ఆదు హీ కుటుంభాయా ఖారీ హింటీ కాడ హుండాడని హెప్పాడ్. హాడాకీ హెల్లాన్. ఆడా హీనోట్టూ రాస్తూ హుండార్. నాకీ సాచ్యం హేస్తామన్నార్. హేషూ కోండి హన్నాన్.

2 వ ప్లీడరు :- అయితే కుటుంబయ్యగారివద్ద రామయ్య ఎంత పైక మును అప్పు పుచ్చుకొన్నాడో నీ కేమైనా తెలియునా ?

పీరుసాహెబు :- తెల్వాకేం మహారాజ్ ! హైదూ హేల్ హన్నార్గా !

2 వ ప్లీడరు :- అయిదువేలని నీతో ఎవరన్నా రేమిటి ?

పీరు సాహెబు :- ఓరూ హనాలేద్ మహారాజ్ ! ఆ రామాయా ఖారే నాకీ హడ్గూతే హెప్పార్.

2 వ ప్లీడరు :- అయితే ఆ పైకం నీ ఎదుటనే రామయ్యగారికి ఇయ్యబడినదా ?

పీరు సాహెబు :- షిత్తం మహారాజ్ ! నాముంగాలె లెఖ్ఖా మెట్టీ హిచ్చార్.

2 వ ప్లీడరు :- ఆ పైకమును రామయ్యగారికి ఎవరు లెఖ్ఖపెట్టి ఇచ్చా రేమిటి ?

పీరు సాహెబు :- ముంగాల కుటుంభాయ్యాఖారు లెఖ్ఖా మెట్టీ పేరాయా ఖారీ షేతీకి హిచ్చార్. హోరు లెఖ్ఖా మెట్టీ య్యాభై హోందా రూపాయల్ ఖాగితాల్ ఈ రామయ్యాఖార్కి హిచ్చార్.

జడ్జి :- పీరుసాహెబ్ ! ఇకను నీ సాక్ష్యము చాలును వెళ్లుము.

పీరు సాహెబు :- ( నిష్క్రమించును. )

జడ్జి :- ఏమిరామయ్యా ! మొదటసారపాటు వ్రాసిన చేఉత్తరమును కుటుంబయ్యగారు నీ ఎదుటనే చింపివేసినట్లు నీవును ఒప్పుకొంటివి. రెండవతూరి వ్రాసిన చేఉత్తరము సక్రమముగనే యున్నది. గనుక కుటుంబయ్యగారు చేఉత్తరములు వ్రాయుసమయమున నిన్ను మోసగించినట్లు అనుమానపడుటకు నాకేమియు ఆధారము కనుపించుటలేదు. కుటుంబయ్యగారి తరపుసాక్ష్యమును సక్రమము గనే యున్నది. నోటుపైగల వ్రేలిముద్రయు నీదేనని యెగ్జామినర్లు స్పష్టపరచిరి. గనుక ఇది ఫోర్జరీనోటుగాదనియు, సక్రమమైన దేననియు నేను నమ్ముచుఖర్చులతోసహా నీపై డిక్రీ...... ( అను సమయమునకు రామయ్యగారి అల్లుడు గోపాలరావు పరుగుపరుగున వచ్చును. )

గోపాలరావు :- (ఆతురముతో లోనికి ప్రవేశించి) ఆనరబుల్ సార్ ! ఓ ! ఆనరబుల్ సార్ ! హియర్ మైరిక్వెస్ట్ ! ప్లీజ్ హియర్ మై రిక్వెస్ట్ ! మై రిక్వెస్ట్ !!

జడ్జి :- (ఆశ్చర్యముతో) హూ ఆర్ యు ? వాటీజ్ యువర్ రిక్వెస్ట్ ?

గోపాలరావు :- అయ్యా ! నేను ఈ రామయ్యగారికి మేనల్లుడను, అల్లుడను అయియున్నాను. నేను ఈ మోసపు కేసును గురించి విచారపడుచు మా మామగారి పంచలో పండుకొంటిని. అంతలో నా కళ్ళకు చూరులో దాగియున్న ఈ కాగితపు ముక్కలు కనుపించినవి. ఏమిటాయని తటాలున తీసి చూచితిని. అది ఈ యద్భుతమైన లేఖయైయున్నది. దీనిని తమరు చూచిన తర్వాత

మీ న్యాయమైన తీర్పు ఇవ్వండి. (అని తన జేబులోనుండి కొన్ని కాగితపు ముక్కలను తీసి జడ్జిగారి ముందుంచును.)

జడ్జి :- (ఆ కాగితపు ముక్కలను సరిగా పెట్టి చదువుకొని తలను పంకించి వాటిపై ఏవియో గుర్తులు పెట్టి) ప్యూన్ ! ఈ కాగితపు ముక్కలను నేను వేసిన నెంబరు ప్రకారము వరుసగా నొకఅట్టపై అంటించుము.

ప్యూను :- చిత్తమయ్యా ! (ఒక అట్టను తెచ్చి ఆ కాగితపు ముక్కలను నెంబరువారీగ అట్టపై అంటించి తెచ్చి జడ్జిగారికి ఇచ్చును.)

జడ్జి :- (మరల పరీక్షించి) కుటుంబయ్యా ! ఈ కాగితపు ముక్కలలో గల ఈ లేఖను కోర్టువారి ఎదుట బిగ్గరగా చదువుము. (ప్యూను వంకచూచి) ప్యూన్! ఈ అట్టను ఆ కుటుంబయ్యకు అందించుము.

ప్యూను :- చిత్తం. (అట్టను తీసికొని వెళ్ళి కుటుంబయ్యకు అందించును.)

కుటుంబయ్య :- (అట్టను అందుకొని చూచి (ప్రకాశముగ) మహారాజరాజశ్రీ అర్సుల కుటుంబయ్యగారికి, పెడదార్ల పేరయ్య నమస్కరించి వ్రాయునదేమనగా, ఆ రాజనాల రామయ్యగారు మీకు బాకీయున్నట్లు మీరు నాచేత ఫోర్జరీ నోటొకటి వ్రాయించి యుంటిరి. దానిపై రామయ్యగారిచేత వ్రేలిముద్రను వేయించిన వెంటనే మీరు నాకు ఇస్తామని ఒప్పుకొన్న వందరూపాయలు పంపుతామని చెప్పియున్నారు. కాని నేటివరకు పంపియుండలేదు. కారణం తెలియదు. ఇప్పుడా నోటుపై వ్రేలిముద్రను వేయించినారా ? లేదా ? ఇంకను నా ఆరోగ్యం సరిగాలేదు. డాక్టరుగారు మరి కొంతకాలం మందు తినవలయునని చెప్పుచున్నారు. గనుక ఇంకో నెలరోజుల వరకు నేను విజయవాడలోనే ఉంటాను. మీరు సాధ్యమైనంత త్వరలో ఆ పని పూర్తిచేసి పైకమును పంపుదురని నమ్ముచున్నాను. పైకం చాల అవసరమై యున్నది. విశేషించి మీకు వ్రాయ పనిలేదు.

ఇట్లు,
పెడదార్ల పేరయ్య వ్రాలు.

( అని చదివి కుటుంబయ్య అట్టను ప్యూనునకు అందించును. )

ప్యూను :- (అట్టను అందుకొని మరల తెచ్చి జడ్జిగారిముందుంచును.)

జడ్జి :- ఏమి కుటుంబయ్యా ! ఈ ఉత్తరమునకు నీ వేమి సమాధానము చెప్పెదవు ?

కుటుంబయ్య :- అయ్యా ! ఇదంతయు సర్వాబద్ధం. ఇది తప్పక ఈ గోపాలరావు సృష్టించుకొని వచ్చిన లేఖయై యుంటుంది. సందేహం లేదు. ఇది ఇతను చదువుకున్నందుకు ఫలిత మండీ.

1 వ ప్లీడరు :- ఏమి గోపాలరావు ! మా క్లయింటైన కుటుంబయ్య గారు చెప్పినట్లు ఇది సృష్టింపబడిన లేఖ కాకపోతే ఇంత అతి రహస్యమైన లేఖ ముక్కలు మీ మామగారి పంచచూరులోనికి ఎలా వచ్చినయ్యంటావు ?

గోపాలరావు :- ఏమో నండి. ఆ విషయం నాకేమీ తెలియదు. ఈ కాగితపు ముక్కలు మాత్రం చూరులో ఉన్న మాట వాస్తవం.

1 వ. ప్లీడరు :- ఏమి రామయ్యా ! ఈ కాగితపు ముక్కలు మీ పంచ చూరులోనికి ఎలా వచ్చినయ్యో నీ కేమైనా తెలియునా

రామయ్య :- (దీర్ఘముగా ఆలోచించి) అయితే, ఇప్పుడు నాకో సంగతి గాపక మొచ్చిందిబాబు ! ఏమంటే, ఈ కుటుంబయ్యగారు నాసేత ఆ పీరుసాయెబుకు రాయించి యిప్పించిన రొండు సే ఉత్తరాల్లో సెడిపోయిన సేఉత్తరాన్ని సింపియేస్తుండానని సెప్పి ఓ కాయితం సింపి మా యింటిముంగల పారేసి ఎల్లాడు. నేను ఆర్ని సాగనంపి వస్తా నూడక ఆకాయితం ముక్కలు తొక్కాను. కాయితా లంటే సరసపతని, ఆటిని తొక్కితే కల్లుపోతయ్యంటారు గందా అని, ఆటినన్నింటిని ఏరి ఆ రోజున ఆ సూరులో దోపేశానండి. కామట్టి ఇయ్యి, ఆ ముక్కలయ్యుండొచ్చు బాబూ !

2 వ ప్లీడరు :- కుటుంబయ్యగారూ ! రామయ్యగారు చెప్పినట్లు మీ రా చెడిపోయిన చేఉత్తరమును వారియింటిముందు చింపివేసినమాట నిజమేనా ?

కుటుంబయ్య :- చిత్తం. నిజమేనండీ.

2 వ ప్లీడరు :- (జడ్జిగారివంకచూచి) ఆనరబుల్ సార్! ఆ ప్రోనోటు వ్రాసినది, ఈ లేఖను వ్రాసినది పేరయ్యగారేకదా? గనుక ఆ రెంటిని సమన్వయపరచి పరీక్షించండి. నిజానిజములు తెలియగలవు.

జడ్జి :- (నోటును ఫైలులోనుండి తీసి లేఖకు ప్రక్కగానుంచి రెంటిని పరీక్షించి) ఏమికుటుంబయ్యా! రెంటిలోని వ్రాతయు నొకరు వ్రాసినదిగనే యున్నది. ఏమాత్రపు మార్పును కనుపించుటలేదు. ఉన్నవాస్తవమును చెప్పుము.

కుటుంబయ్య :- నిజముగా ఆ ఉత్తరమును గురించి నాకేమీ తెలియదండి. పేరయ్యగారుకూడ ఇచటనే యున్నారు. వారిని పిలిపించి విచారించండి. నిజము తెలియగలదు.

జడ్జి :- ప్యూన్! ఆ పెడదార్ల పేరయ్యను పిలువుము.

ప్యూను :- చిత్తం. (ద్వారముకడకు వెళ్ళి) పెడదార్ల పేరయ్యా! పెడదార్ల పేరయ్యా! (అని బిగ్గరగ కేకలు వేయును)

పేరయ్య :- (వెలుపలనుండియె) ఏమిటి విశేషం?

ప్యూను :- ఏమో! జడ్జిగారు రమ్మంటుండారు.

పేరయ్య :- (లోనికి ప్రవేశించి జడ్జిగారినిచూచి నమస్కారము చేయును.)

జడ్జి :- పేరయ్యా! ఈ దస్తూరి ఎవరిదో సరిగాచూచి చెప్పుము. ప్యూన్! ఈ అట్టను పేరయ్యకు అందించుము.

ప్యూను :- చిత్తం. (అట్టను అందుకొని తీసికొనివెళ్ళి పేరయ్యకు అందించును.)

పేరయ్య :- (అట్టను అందుకొని కళ్ళజోడు పెట్టుకొని కొంతసేపు ఆ ఉత్తరమును పరిశీలించి) చిత్తం. చూచుటకు నా దస్తూరిలాగనే యున్నది. కాని నాది కాదండి.

జడ్జి :- (కోపముతో) ఏయి పేరయ్యా! ఉన్నది ఉన్నట్లు చెప్పుము. లేనియెడల నిన్ను ప్రాసిక్యూషన్ చేసెదను. జాగ్రత్త!!

పేరయ్య :- (వణకుచు అట్టనుబల్లపైనుంచి చేతులు నలుపుకొనుచు గద్గద స్వరముతో) జడ్జిగారూ! జడ్జిగారూ! బుద్ధిగడ్డితిని దురాశకులోనై ఈ దుర్మార్గపు పనిచేశాను. ఇకను నా జీవితములో ఎన్నడు ఇటువంటి నీచపుపని చేయను. ఈ తప్పును క్షమించండి. మీ పాదములకు మ్రొక్కుతాను. బుద్ధి వచ్చినది. జడ్జిగారూ నన్ను రక్షించండి. రక్షించండి.

జడ్జి :- పటప్! (కుటుంబయ్యనుచూచి) ఏమి కుటుంబయ్యా! ఇకను ఇప్పుడు నీవుచెప్పు సమాధాన మేమి?

కుటుంబయ్య :- (మాట్లాడక తలవంచు కొనును.)

జడ్జి :- ప్యూన్! ఆపీరుసాహెబునుకూడ పిలువుము.

ప్యూను :- చిత్తం. (ద్వారముకడకు వెళ్ళి) సేకు పీరుసాయెబూ! సేకు పీరుసాయెబూ! సేకు పీరుసాయెబూ! (అని బిగ్గరగ కేకలు వేయును.)

పీరుసాహెబు :- హెందూఖుయూ మల్లీ.

ప్యూను :- రావయ్యా! రా! పని ఉండమట్టే పిలుస్తుండారు. జల్దీగా రా.

పీరుసాహెబు :- (లోనికి ప్రవేశించి జడ్జిగారినిచూచి) సలాం మహా రాజ్ సలాం. (అనివంగి సలాము చేయును.)

జడ్జి :- (కోపదృష్టితో) ఏయి ఫూల్! ఇంతకుముందు నీవుచెప్పిన సాక్ష్యమంతయును సరియైనదేనా? ఉన్నది ఉన్నట్లు చెప్పు. లేనియెడల నీ పని ఏ మగునో తెలిసికొనుము.

పీరుసాహెబు :- (కుటుంబయ్య, పేరయ్యల వంకజూచి ఆశ్చర్యముతో తనలో) హారేహల్లా! నాకొంఫాముణ్గిందే. హిప్పుడ్ నాకీ హెట్టా చెప్పాలో తోసాడం లేద్. ఇఘూహున్నాది హున్నట్టు హెప్పీ హేస్తాన్.

జడ్జి :- ఏయి పీరూ! ఏమిటా యాలోచన. త్వరగా చెప్పు.

పీరుసాహెబు :- హేమీలేద్ మహారాజ్! హీ కుటుంభాయాఖారు షెప్పామన్నట్టు నాకీ సాచ్యం షెప్పేశాన్. హాంతేబాబు. నాకీహీ గొడ్వా హేమీ తెల్వాదండి. హీ తప్పూ ఛమించండి మహారాజ్! పిల్లాజల్లాకల్యాణ్ణి. సలాం సేస్తాన్ మహారాజ్! (అనివంగిసలాము చేయును.)

జడ్జి :- అతిగా మాట్లాడకుము. నీవును అటువెళ్ళి నిలబడుము. (కుటుంబయ్య పేరయ్యలున్నదిక్కు చూపును.)

పీరుసాహెబు :- (బిక్కమొగముతో) షిత్తం మహారాజ్ షిత్తం! (అనివెళ్ళి కుటుంబయ్య, పేరయ్యల ప్రక్కగ నిలబడును.)

జడ్జి :- (వారి ముగ్గురనుచూచి) దుర్మార్గులారా! చదువురాని అమాయకుడైన యీ రైతుబిడ్డను మీరెంతటి మోసముచేయ బూనుకొంటిరి? మీరింకెంత పనిచేయుటకైనను సాహసులు. కల్లను ఎంత నిజముగా రూపింపగల్గితిరి? ఇట్టి మీ నాలుకలను తుత్తునియలుగా ఖండించినను పాపము లేదు. నిజముగా ఈ రామయ్య కల్లాకపటములేని ధర్మశీలు డగుటవల్లనే ఆ భగవంతుడు ఇట్టి అపూర్వమైన సాక్ష్యమును తుదిక్షణములలో ఈయనకు ప్రసాదించెను. నీచులారా! మీ మొగములు చూచిన మహాపాతకములు రావచ్చును. (రామయ్యనుచూచి) రామయ్యగారూ! ఈ మోసగాండ్రు మీపై తెచ్చిన ఈ అక్రమమైన అభియోగమును కొట్టివేయుచున్నాను. (కుటుంబయ్య వాండ్రవంక చూచి) వంచకులారా! మీరుచేసిన ఈ ఘోర్గరీ నేరమునకుగాను ఇండియన్ పీనల్‌కోడ్ 420, 471 వ సెక్షన్ల ప్రకారం మీ ముగ్గురకును తలకొక వేయిరూపాయలు జరిమానాయును, మూడేసి సంవత్సరములు కఠినమైన జైలు శిక్షయును విధించుచున్నాను. జరిమానా చెల్లింపనియెడల అదనముగా మరియొక సంవత్సరము జైలు శిక్ష అనుభవింపవలయును. (రామయ్యనుచూచి) రామయ్య

గారూ! మీ సత్యసంధతే మిమ్ము కాపాడినది. ఇకను మీరు వెళ్ళ వచ్చును.

( తెర వ్రాలును. )

(మరల వెంటనే తెరఎత్తబడును. అప్పుడు చేతులకు సంకెలలు తగిలింపబడియున్న కుటుంబయ్య, పేరయ్య, పీరుసాహెబులు, విచార వదనములతో ఒక కానిస్టేబులు వెంబడి నడచుచు ప్రవేశింతురు.)

కుటుంబయ్య :- (ప్రజలనుద్దేశించి విచారముతో) ఓ ప్రజలారా !

ఉ. దుర్మతినై దురంతమని ।
తోచుచు నున్నను రైతుబిడ్డపై
మర్మముగాఁగ నోటునటు ।
మాయగ ఫోర్జరి చేసినందు కా
కర్మఫలంబు నేఁడిటుల ।
గ్రక్కునఁ బొందుచు నుంటిగావునన్
దుర్మతులైన వారలకు ।
దుర్గతి తప్పదు తప్పదెన్నడున్ ॥

కనుక మీరు

తే. ధాత్రి మాబోటి చెనఁటుల । మైత్రిఁజేసి
మంటబెట్టుకొనకుఁడు మీ । మంచితనము
చూచినారుగ మాపాట్లు । చోద్యముగను
ఇంక మీకు నేఁజెప్పన । దేమికలదు?

పేరయ్య :- (దీనముగ) ఓ బాబులారా! తల్లులారా! అమాయకుడైన ఆ రైతురామయ్యపై అక్రమముగా నోటును సృష్టించునపుడు.

తే. "ధర్మమే జయం"బనునుడి । దలఁపకేను
ధనము కోసము పాపినై । దయను విడిచి
మూఢమతియైన రైతును । మోసగించి
తగిన ఫలమును బొందగా । దరలుచుంటి.

అయినను

తే. ధరణి నెవరైన నన్యుల । తక్కు చేసి
తగిన ఫలమును బొందక । తప్పుకొనిరె
కుక్కుటంబయి గౌతము । టక్కుఁజేసి
భంగపడఁడె దేవేంద్రుఁడే । పరువుపోవ.

కావున మీరు మా మార్గముననుసరించి మీ పరువు ప్రతిష్ఠలను పాడుచేసికొనకండి బాబూ.

పీరుసాహెబు :- (విచారముతో) హాయ్యాల్లారా! నాకీ గ్రహాపారం సాల్కా హీ కుటుంభాయా పేరాయాఖార్లాతో మిలాఖత్ హై, ఆరామాయాఖార్కీ మోహం సేయాలనీ చూశాన్. హాంద్కా నాకీబుద్ధీ పెట్టాన్కి హీ భేడీలు ధగుల్ ఖుండయి. ఘన్కా మనం వఘర్కీ హుప్కారం సేయాలనీ షూస్తే, ఆ భగ్‌మంతుడ్ మన్కే హాప్కారం సేషీహేస్తాడ్. ఖామట్టీ మీార్ హిమ్మంటి లుచ్ఛాల్తో నేస్తంసేషీ మీ ఖొంపల్ ఘూల్చాకోకండి మహారాజ్! (అని సలాముచేయును.)

కానిస్టేబుల్ :- ఏయి! ఇక మీారిక్కడ ఒక్క క్షణమాగుటకు వీలు లేదు. రండి రండి.

(అని తొందరచేయగా కానిస్టేబులు వెంటబడి వారు ముప్వురును నడచు చుందురు.)

( తెర వ్రాలును. )

మూడవ అంకము సమాప్తము.

# నాల్గవ అంకము.

## మొదటి రంగము.

( పోస్టు మాష్టరుగారి యిల్లు. )

(రాత్రి సమయము. ఇంటి తలుపులు వేసియుండును. పోష్టు జమాను రంగనాథము ప్రవేశించును.)

రంగనాథం :- (తలుపు తట్టుచు మెల్లగ) మాష్టరుగారు! మాష్టరుగారూ! ఏమండోయి మాష్టరుగారు! (అని పిలచును.)

పోస్టుమాష్టరు :- (లోపలనుండియే) ఎవరు వారు? వస్తున్నా! వస్తున్నా! (తలుపు తీసి రంగనాథమును చూచి మిక్కిలి ఆశ్చర్యముతో) ఓ! రంగనాథమా? ఏమిటి విశేషం? ఇంత రాత్రివేళ వచ్చావు?

రంగనాథం :- (మెల్లగ) లోపలకు పదండి. మీ కొక రహస్యం చెప్పాలి.

(ఇరువురును లోనికి పోవుదురు.)

పోస్టుమాష్టరు :- (కుర్చీలో కూర్చుండును.)

రంగనాథం :- (బల్లమీద కూర్చుండి) మాష్టరుగారూ! ఏమి చెప్పను? మన కొంపలు నిలువున కూలిపోవు రోజు వచ్చినది. (విచారముగ)

ఆ॥ కనులు మూసికొనియు। " కానరు నన్న "ని
పాలు త్రాగు పిల్లి। పగిది నేను
ఒరులు గాంచలేదు। ఓగు లేదనుకొంటి
దేవుఁడుండె నన్న। తెలివి మాలి.

పోస్టుమాష్టరు :- (కంగారుతో) ఏమిటి? రంగనాథం! నీ మాటలు నా కేమీ అర్థంకావడం లేదు. అసలు విషయ మేమిటో త్వరగా చెప్పు.

రంగనాథం :- (దీనముగ) ఏమి చెప్పేది? మాష్టరుగారూ!

తే॥ అపుడు రైతు రామయ్యతో । నన్నృత మాడి
నూరు రూక ల్గడించితి । నొప్పిలేక
మీరు వద్దు వద్దనగను । మీకు నందు
భాగ మిచ్చితి నెంతయుఁ । బాపమనక.

పోస్టుమాష్టరు :— (కంగారుపడుచు) అయితే ఇప్పుడు మరల ఏమయింది రంగనాథం ? మొన్న రామయ్యగారి అల్లుడు గోపాలరావు, సబిన్స్పెక్టరు సుబ్బయ్య పంతులుగార్లు మనల్ని పిలిపించి ఈ విషయమును గురించి అడిగినప్పుడు అసలు ఆ తేదీగల ఉత్తరం పోస్టుకు రాలేదనియు, ఆయన మనియార్డరు చేయుమని మా చేతికి పైకం ఇయ్యలేదనియు, గట్టిగా చెప్పి వచ్చితిమిగదా !

రంగనాథం :— చెప్పివచ్చినమాట వాస్తవమే. అయితే ఇప్పుడు ఒక పెద్ద పొరపాటు జరిగింది. ఈ ఉదయమే మా పిల్లవాడు ఆ ఉత్తరం ఎక్కడడుంటేనో తీసికొని బడికి వెళ్ళినాడట. పంతులు భీమశంకరం గారు దానినిచూచి వెంటనే గోపాలరావుగారిని పిలిపించి వారికిచ్చాడట.

పోస్టుమాష్టరు :— అయితే రంగనాథం ! ఆ ఉత్తరమును నీవు చింపి వేయ లేదా ఏమి ?

రంగనాథం :— లేదండీ మాష్టరుగారు ! అదే నా తెలివి తక్కువ.

పోస్టుమాష్టరు :— ఆ తర్వాత ఏమి జరిగింది రంగనాథం ?

రంగనాథం :— ఏమి జరుగవలయునో అదియే జరిగింది. గోపాలరావుగారు ఆ ఉత్తరమును తీసికొని పోలీసుస్టేషనుకువెళ్ళి సబిన్స్పెక్టరుగారికి చెప్పి మనపై కేసుపెట్టినాడట. ఇకనుమనం ఏమి చేయాలి ? మాష్టరుగారూ !

పోస్టుమాష్టరు :— (కంగారుపడుచు వణకిపోవుచు గద్గద స్వరముతో) అరే రంగనాథం ! నీ కల్లబొల్లి పలుకులకు మోసపోయి నాకొంపను నిలువున కూల్చుకొన్నాను. ఊబిలో దిగబడ్డాను. నాగౌరవ ప్రతిష్టలను గంగపాలుచేసుకున్నాను. ఇప్పుడనుకొని ప్రయోజనమేమి ?

చ. తెలివిని మంటఁగల్పుకొని ।
తీవరపాటున నీదు మాటలన్
చెలిమిని నమ్మి మోసపడి ।
చేటును జేతులఁ దెచ్చుకొంటిగా !
తులువల నెయ్యి మిట్లుబలె ।
తుంటరివానినిఁ జేయునంచు నేఁ
దెలిసితిగాని ముందుపని ।
తేలుటలేదుగ ! యేమి చేయగన్॥

రంగనాథం :- (బిక్క మొగముతో) నాకును ఏమి తోచడం లేదు మాష్టరుగారూ !

పోస్టుమాష్టరు :- (కంపిత హృదయముతో) ఇంక నీకు నాకు తోచే దేమిటి వల్లకాటిమిట్ట. పద ఆ వందరూపాయలకు తోడు అపరాధం క్రింద ఇంకొక వంద తీసికొనివెళ్ళి ఆ గోపాలరావు కాళ్ళమీదపడి మొత్తుకుందాం. తెల్లవారి రాబోయే ముప్పునుండి బయటపడుదాం.

రంగనాథం :- మాష్టరుగారూ! నిజముగా మనకు అంతకుమించిన గత్యంతరంలేదు. ఇప్పుడేపోదాం పదండి. (ఇరువురును నిష్క్రమింతురు.)

( తెర వ్రాలును. )

## రెండవ రంగము.

రైతు రామయ్యగారియిల్లు.

(రాత్రిసమయము. రామయ్యఅల్లుడు గోపాలరావు మంచముపై కూర్చుండి చదువుకొను చుండును.)

రంగనాథం :- (రామయ్యగారి యింటితలుపు నెట్టును.)

గోపాలరావు :- (తలుపుచప్పుడువిని ముందునకుచూచి) ఎవరువారు ? (అని తలుపు తీయును.)

రంగనాథం :— (గోపాలరావును సమీపించి కాళ్లుపట్టుకొని గద్గదస్వరముతో) అయ్యా! అమాయకుడైన మీ మామగారిని మోసము చేసి నూరురూకలు కాజేసిన నరరూపరాక్షసుడనగు రంగనాథాన్ని. దురాశాంధకారము కన్నులకు కప్పియుండుటచే పైన దైవముకలడని యైనను జంకక ఈ దుర్మార్గపుపనిచేశాను. ఇకను నాజన్మలో ఎన్నడు ఇటువంటి నీచపుపనిచేయను. బుద్ధివచ్చింది. చెంపలు వేసుకొంటాను. (అని చెంపలువేసికొని) ఈ తప్పును క్షమించి నన్ను రక్షించండిబాబూ రక్షించండి.

గోపాలరావు :— (కోపముతో) ఓరీ! మాయలమారి రంగనాథమా!

శా॥ చాలుం జాలిక నీదు టక్కుపలుకుల్
చాలించి పోపోర నీ
మేలుంగోరుట కాలసర్పమునకుఀ
మేల్సేయుగాఁ జూచుటే
జాలింబొందక నీదు చెడ్డతనముఀ
జాటింపు వేయించియుఀ
మేలుంజేయక యున్న లోకమునకుఀ
మేలౌనె! దుష్టాత్మకా!

కావున నీ కల్లబొల్లి పలుకులకు నాకు జాలివేయదు. వేయకూడదు.

రంగనాథం :— (వణకిపోవుచు అతిదీనముగ) గోపాలరావుగారూ!

ఉ॥ మానవజన్మమెత్తియును।
మాయలమారి మనంబు గల్గుటఀ
మానములేక మిమ్ములను।
మాయను ముంచితి నేర్పు మీరఁగన్
మానుగ నేఁడు బుద్ధి కడు।
మారెను. జేసిన తప్పు కెంతయున్
మానసమందుఁ జింతిలితి।
మానుఁడు కోపము నుల్లమందునన్.

(మిక్కిలి దుఃఖముతో) అయ్యా! ఇప్పుడు మీరు నాయందు దయ చూపకపోతే నాకు శిక్ష తప్పదు. ఈ ఉద్యోగ ముండదు. దానితో ముదుసలులైన నా తల్లిదండ్రులు, అమాయకులైన నా ఆలుబిడ్డలు అన్నము లేక అలమటించి చచ్చిపోదురు. కాన ఈ నా తప్పును మన్నించి నన్ను కాపాడండి బాబూ! కాపాడండి. (ఇంతలో పోస్టు మాష్టరు ప్రవేశించును)

పోస్టు మాష్టరు :- (గోపాలరావు రెండుచేతులను పట్టుకొని అతి దీనముగ) గోపాలరావు!

ఉ॥ పట్టితి చేతుల న్మిగుల।
పాదము లట్లుగ నెంచియే మదిఀ
గట్టిగ నేను నమ్మితిని।
కాతు వటంచును నేరమెంచకే
బెట్టుగ నెంతయో బ్రతికి।
పేరును నే డిటు వ్యర్థపుచ్చితిన్
గట్టిగ నన్నియు న్దెలియుఁ।
గావున నీ కిఁక చెప్పనేటికిఀ.

అయినను ఇప్పుడు నేనేమి చెప్పినను నిష్ప్రయోజనము. నేను ఒకరి మాటలు నమ్మిచేయనీ, స్వబుద్ధితో చేయనీ, మోసము చేసిన అపరాధినే కదా! శిక్షకు పాత్రుడనేకదా! కాన ఈ నా మొదటి తప్పును మన్నించి నన్ను కాపాడవలయునని కోరుచున్నాను.

గోపాలరావు :- (గంభీరముగ) మాష్టరుగారూ! ఇప్పుడు మిమ్మేమనవలయునో తెలియకున్నది. ఇంత విద్య, వివేకం గల మీరే చెప్పుడు మాటలకు చెవియొగ్గి ఇట్టి నీచపు పనికి పూనుకున్నారంటే ఎంత తలవంపులో బాగా ఆలోచించండి. మీరీ నీచపు పని చేసి నిష్కళంకమైన మీ వంశానికి కళంకం తెచ్చిపెట్టినారంటే నాకే లజ్జగా ఉన్నది!

పోస్టు మాష్టరు :- (దీనముగ) ఔను గోపాలరావు!

తే॥ నీవు చెప్పిన దంతయు। నిక్కవంబె
కాని, కర్మానుసారంబు। కదలు బుద్ధి
ముప్పు దలపక లేశము। మున్ను సీత
మాయ మృగమును కోరదె?। మమతతోడ॥

కావున నా రోజులు మంచివిగాక, నాబుద్ధి అట్టినీచపుదారి పట్టింది. ఇప్పుడా విషయం గ్రహించినాను. ఇకనుమాత్రం మట్టితప్పుడు మార్గమున నడువను. నా మాట నమ్ము. నన్ను కాపాడు.

( ఇంతలో రామయ్య ప్రవేశించును. )

రంగనాథం :- (రామయ్యను సమీపించి మిక్కిలి దుఃఖముతో) రామయ్యగారూ! రామయ్యగారూ! బుద్ధిగడ్డితిని మిమ్మల్ని మోసం చేశాను. ఆ తరువాత ఆ తప్పును కప్పిపుచ్చుకొనుటకు ఎన్నో అబద్ధాలాడాను. అప్రమాణాలు చేశాను. కాని దైవము సత్యమును బయలుపరచి అసత్యవాదినైన నాకు బుద్ధి చెప్పింది. నాకిప్పుడు పూర్తి బుద్ధి వచ్చినది. నా తప్పును క్షమించి నన్ను కాపాడండి బాబూ! కాపాడండి. (అని రామయ్య కాళ్లమీదపడును.)

రామయ్య :- (రంగనాథమును లేవదీయుచు) లెగు రంగనాదం లెగు. నీ వట్టా మోసంచేసి డబ్బు కాజేశావుకాని అంతగా నీకు డబ్బు అవసరమైతే నన్నడక్క పొయ్యావా? ఇంకోవందరూపాయలైనా ఇచ్చేవాణ్ణిగ! ఇగను ఎప్పుడు ఇట్టాంటి సెడ్డపన్లు సేయమాకు. సదువుకున్నందుకు ఇంతబుద్ధి గలిగుండు. పెపంచంలో బతికిన నాలుగురోజులు మంచోడనిపించుకోవాలె రంగనాదం!

రంగనాథం :- చిత్తం రామయ్యగారూ! చిత్తం. మీరు చెప్పినట్లు ఇకను బుద్ధిగలిగి ఉంటాను.

పోస్టుమాష్టరు :- (రామయ్యను సమీపించి దీనముగ) రామయ్య బాబూ! మీనిష్కళంకమైన బుద్ధిని గ్రహింపక మిమ్ము మోసము చేసిన మహాపరాధిని. నన్ను మన్నించి రక్షించండి.

రామయ్య :- (జాలిగ) ఏంటాలె నాయనా! రచ్చించటం-బచ్చించటం మనవల్ల అవుద్దా? ఏమిసేసినా ఆ బగమంతుడే సేయాల. ఇట్టా

జరుగుతుందని మన మెప్పుడైనా అనుకుండామా ? అంతా మనం ఎప్పుడో సేసుకున్న కరమనుబట్టి జరుగుతా ఉంటది. కాబట్టి మనం ఇట్టాంటి సెడ్డపన్లు సేయకుండ మన బుద్ధికి బుద్ధి సెప్పుకోవడం ఎంతో మంచిది బాబూ!

పోస్టుమాష్టరు :- రంగనాథం! ఏది, ఆ పైకం రామయ్యగారికివ్వు.

రామయ్య :- పైకమేంటి నాయనా !

పోస్టుమాష్టరు :- మిమ్ములను మోసముచేసి కాజేసిన డబ్బు బాబూ !

రామయ్య :- (దాతృత్వబుద్ధితో) ఆ పైకం నా కివ్వొద్దులే నాయనా ! మీ రెంత ఇబ్బందిలోఉండి దాన్ని తీసుకుండారో ?– ఇప్పుడు నేను మీకు దాన్ని దర్మంగా వదిలి పెడుతుండాను. మీరే వాడుకోండి. ఇగనుమాత్రం ఇట్టాంటి నీశప్పన్లు సేయక సదువుకున్నందుకు ఇంత గాణంగలిగి ఉండండి బాబూ ! ఎల్లండి. పొద్దుపోయింది.

పోస్టుమాష్టరు :- (గోపాలరావును సమీపించి) గోపాల్ రావు! నీవైనా ఈ పైకమును తీసికొని మా మనస్సులకు శాంతి కలుగ జెయ్యి.

గోపాలరావు :- మేము పైకం తీసుకొనలేదని మీరేమీ ఆందోళన పడకండి మాష్టరుగారూ! అది మా ఇష్టము మీదనే మీకు ఇచ్చి వేస్తున్నాం. అయితే మీరు ఈ ప్రపంచములో శాశ్వతముగా నిలుచునది కీర్తి కాని ధనము కాదని మాత్రం గ్రహించండి. ఇకనైనా మీరు మీ ఉద్యోగ ధర్మమును చక్కగా నిర్వర్తించు కొంటూ ఈ కళంకాన్ని పోగొట్టుకొన ప్రయత్నించండి. ఇకను వెళ్లండి.

పోస్టుమాష్టరు :- (దీనముగ) వెళ్ళుట కేమిగాని, గోపాలరావు !

ఉ. చేసిననేర మెంచకయె ।
చేసితి రెంతయుమేలు; కాని యా
మోసపుడబ్బు మీ రిపుడు ।
మోదముతోడను బుచ్చుకొన్న; మా

మోసపు పాతకంబునకు ।
మోక్షము కల్గును; లేనిచో నిఁకన్
గాసునుదప్ప దాయముని ।
కర్కశదండన బాధ మాకటన్.

కాన మీరీ పైకమును తీసికొని మమ్ము కృతార్థులను చేయండి.

గోపాలరావు :- ఏమి మామయ్యా! వారలా అంటున్నారు, మరేం చెబుదాం?

రామయ్య :- నాకేం తోసడం లేదోయి. ఏదోటి నీవు సెప్పి పంపు పాపం.

గోపాలరావు :- అలా అయితే మాష్టరుగారూ! మీరీ పైకమును మన హైస్కూలు దగ్గర కడుతూఉన్న హరిజనుల హాష్టలుకు మా మామగారిపేర చందాగా ఇవ్వండి. ఇకను వెళ్ళండి. ఇప్పటికే చాల ప్రొద్దుపోయింది.

పోస్టుమాష్టరు :- గోపాలరావు! నీవు చెప్పినట్లే తప్పక చేస్తాను. (రామయ్యనుచూచి) రామయ్యబాబు! ఇఁక వెళ్ళివస్తాను.

రంగనాథం :- (రామయ్యను, గోపాలరావునుచూచి) అయ్యలారా! మీరుచేసిన ఈ మేలును నా జీవితములో ఎన్నటికిని మరచిపోను. ఇకవస్తాను. (అని నమస్కరించును.)

రామయ్య :-
గోపాలరావు :- } మంచిది పోయిరండి.

(పోస్టుమాష్టరు, రంగనాథం, నిష్క్రమింతురు.)

రామయ్య :- (దీనముగ) ఏమోయి గోపాలం! నాబోటి సదువురాని వారి సంగతి ఇక ఇంతేనా?

గోపాలరావు :- కాదు కాదు మామయ్యా! ఇప్పుడు మన ప్రజా ప్రభుత్వంవారు, మీబోటి చదువురాని పెద్దవాళ్ళంతా చదువుకొనేందుకు రాత్రి బళ్లు పెట్టిస్తున్నారు. కొద్ది రోజుల్లోనే మనఊళ్లో

కూడ ఒక రాత్రి బడి పెట్టుటకు అన్ని ఏర్పాట్లు జరిగినయిట. ఇక మీరు అందులోచేరి, చక్కగా చదువుకోవచ్చును. ఒకటిరెండేండ్ల లోనే బాగా చదవటం, వ్రాయడం నేర్పుతారు. ఇక ఇట్టి మోస గాండ్ర ఆటలు సాగవు. నేను రేపు వెళ్ళి ఆ వయోజన విద్యా లయములోని ఉపాధ్యాయులెవరో తెలిసికొని మాట్లాడి, నిన్ను చేర్చుకొనే ఏర్పాటుచేసి వస్తాను. ఇకను నీవు చదువులేదనిమాత్రం దిగులు పడవద్దు.

రామయ్య :– అయితే పెబుత్వంవారు మంచి ఏర్పాటే సేస్తుండారన్న మాట. గోపాలం! నేనుకూడ వస్తాను. పోయి మాట్లాడుదాం. ఎట్లాగైనా సదివి తీరాల్సిందే.

గోపాలరావు :– అలాగే పోదాంలే మామయ్యా !

(తెరవ్రాలును)

## మూడవరంగము.

జగన్నాథరావుగారి యిల్లు.

(జగన్నాథరావు నిలువుటద్దముదగ్గర నిలుచబడి క్రాపును దువ్వుకొనుచుండును.)

నాగులు :– (ప్రవేశించి) బాబయ్యగోరు యాడకో పెయానమవు తుండారే ?

జగన్నాథరావు :– (చూచి ఆశ్చర్యముగ) ఓహో ! ఏమిరోయి నాగులూ ! ఎప్పుడు రావడం ? అంతా కులాసాగా ఉన్నారా ?

నాగులు :– ఆ ! మీ దయవల్ల అంతా బాగానే ఉండాం బాబయ్యా! అమ్మగోరు, అబ్బాయాల్లంతా బాగుండారా ?

జగన్నాథరావు :– ఆ ! అంతా బాగానే ఉన్నారు. అయితే వాళ్ళి ప్పుడు గుంటూరులో ఉంటున్నారురా !

నాగులు :– ఆ డెందుకుంటున్నారు బాబయ్యా ?

జగన్నాథరావు :- అబ్బాయివాళ్లు అక్కడ చదువు కొంటున్నారు.

నాగులు :- అయితే బాబయ్యా గోరు! ఈడ మనూళ్లో అయిసుకూలు ఉండదిగా, ఆడకెందుకు పంపారు ?

జగన్నాథరావు :- ఇక్కడి చదువు అయిపోయింది. అక్కడికి పై చదువుకు పంపాను.

నాగులు :- (సంతోషముతో) బలేమంచి పనిసేశారు. నాకు సాల సంతోసంగా ఉండది బాబయ్యా!

జగన్నాథరావు :- సరేకాని నాగులు! నీవు వెళ్ళిన ఈ నాలుగేండ్ల నుంచి సరియైన పాలేరుదొరక్క నానాబాధలు పడుతున్నాను. అందువల్ల ఇప్పుడు నీ కోసం మనిషిని పంపుదామను కొంటున్నాను. సమయానికి నీవేవచ్చావు. ఈ సంవత్సరం మనకొక మంచి పాలేరును మాట్లాడిపెట్టు నాగులూ!

నాగులు :- మీా రంత యిబ్బంది పడకమోతే కాక్కాలితో కబురు సేస్తే ఓర్నోఒకర్ని అప్పుడే పంపక పొయ్యానా ?

జగన్నాథరావు :- సరే! జరిగిందేమో జరిగింది. ఇప్పటికైనా ఒక మంచి పాలేరును మాట్లాడి తప్పకపంపు నాగులూ!

నాగులు :- అట్టాగే పంపుతాలే బాబయ్యా! (ఆశ్చర్యముగ) చరే కాని బాబయ్యగోరూ! ఇదేంటి? ఇందాక నేను ఆ పంచాయితీ ఆపీసు ముంగలగా వస్తా ఉంటే, ఆ రాజనాల రామయ్యగోరు సొక్కాగిక్కా ఏసుకోని లోన కురిసీలో కూకోని ఉండాడే, ఆయన ఆడ ఎందుకూక్కోని ఉండాడు బాబయ్యా!

జగన్నాథరావు :- ఇంకా ఈ సంగతి నీకు తెలేలేదా ఏమిరా ?

నాగులు :- ఏం చంగతి బాబయ్యా! నాకేం తెలవలేదే ?

జగన్నాథరావు :- అయితే చెప్తా విను. మొన్నజరిగిన పంచాయితీ బోర్డు ఎన్నికల్లో మేమంతాకలసి ఆయన్ని మా గ్రామపంచాయితీ బోర్డు ప్రెసిడెంటుగా, ఏకగ్రీవంగా ఎన్నుకున్నాంరా.

నాగులు :- అయితే ఈ సంగతి సాల ఇసి_త్తరంగా ఉండది బాబయ్యా! ఆ రామయ్యగోరేంటి ఈ ఊరికి పెసిరెంటుపని సేయటం ఏంటి ? ఇగ ఈఊరు బాగుపడ్డట్టే.

జగన్నాథరావు :- (కుర్చీలో కూర్చుండి) ఇదేమిట్రోయి నాగులు! మా ఊళ్ళోవాళ్ళంతా వట్టి తెలివితక్కువవాళ్ళు అయినట్లు నీవు మహాతెలివిగల వాడవైనట్లు మాట్లాడుతున్నావు. నీ కంటికి ఆ రామయ్యగారు ఆగలేదా ఏమిరా ?

నాగులు :- అదిగాదండి బాబయ్యగోరు! ఆయనకు సదువురాకపోగా ఆకరికి సిన్నదో పెద్దదో సంతకమైనా శాతకాదుగందా ? ఇగను అట్టాంటాయనవచ్చి ఏంసేస్తాడంట.

జగన్నాథరావు :- ఆయన ఏమిచేయాలేమిట్రా ?

నాగులు :- అన్నీ తెలిసినోగు మీరే అట్టా మాట్లాడితే నేనేం సెప్పేది బాబయ్యా! పెసిరెంటుపనంటె మాటలా? ఊల్లో యిల్ల పన్నులు, బండ్లపన్నులు, వృ_త్తిపన్నులు, ఇంకా ఏ వేంటోపన్నులు, వసూలు సేయించాలా ? ఆటికి జమాకర్సులు సూసుకోవాలా ? పయినుంచి ఆపీసర్లు ఆళ్ళు వస్తా ఉంటే ఆరికి దగిన సమాదానాలు సెప్పి పంపాలా ? అప్పుడప్పుడు మీటింగులంటూపెట్టి గామానికి కావల్సిన చౌకర్యాలు నిరణయించుకోవాలా? ఆటిని పయ్యోరికి పంపి మంజూరు సేయించుకోవాలా ? ఒకటేంటి బాబయ్యా ! ఇట్టాంటివన్ను ఎన్నో ఉంటయిగందా ? ఆటిని శాకశక్యంతో బ్రుపయోగించి సేసుకోవాలా వద్దా ? మీరే సెప్పండిబాబయ్యగోరూ !

జగన్నాథరావు :- (ఆశ్చర్యముగ) అరె! నాగులు! నీవు చాల అసాధ్యుడవేనే, ఈ విషయాలన్నీ నీకెలా తెలుసురా ?

నాగులు :- నా మొగం. నాకెం తెల్సు బాబయ్యా! మీబోంటిసదువుకున్నోరు సెప్పుకుంటావుంటే ఇంటమేగాని.

జగన్నాథరావు :– ప్రెసిడెంటుకు చదువురాకపోతే ఏమిరా? గుమాస్తా ఉంటాడు. ఆయనే అన్నిపనులు సరిచేసికొని పోతుంటాడు.

నాగులు :– గుమాస్తా ఎంతసేసినా పైన అసులోరుకూస్తె తనికీసేసు కుంటాఉంటే ఎంతమంచిది బాబయ్యా! ఆపనే సేతకాకమోతే ఇగను సూడండి. ఊల్లో పాతికరూపాయలపని జరుగుతాఉంటే గుమాత్తాజోబు ముప్పాతికరూపాయల్తో నిండుతాఉంటది. నిజమొ అబద్ధమొ కాని, సదువురాని పెసిరెంటొకాయన గుమాస్తాను పెట్టి పని సేయిస్తుండాడంట. ఆ గుమాస్తా ఏంచేశాడో ఏంటో పాపం. పయ్యోర్ను ఆ పెసిరెంటుమీన ఓ నాలుగేల రూపాయలకు సరిశా రిజిసేశారంట. ఆ మాటేంటొ నాకు తెలవదుగాని, ఆ పెసిరెంటు గవరనమెంటోరికి నాలుగేల రూపాయలు కట్టాల్సొచ్చిందంట. అప్పుడాయన ఏం సెయ్యాలేక ఉండ ఆస్తమ్మి కట్టాడంట. ఇట్టా ఉంటది సదువురాని పెసిరెంట్లయవ్వారం. ఇగను మన రామయ్యా గోరు అసులే నిసానిదారు. ఇదియరకే ఆయన్ని మోసంసేసి ఆయనమీన ఓ పోర్జరీనోటు పుట్టించడం దానిమీన ఓ పెద్ద యవ్వారం జరగడం మనకుతెల్చే ఉండదిగందా? ఇగను అట్టాం టాయన గుమాస్తానుపెట్టి ఏం సేయిస్తాడంట. ఉండమాటంటే ఓరి కైనా కోపమొచ్చుద్దిగాని, అసలు మన పెజల్దేతప్పు బాబయ్యా! ఏమంటే? మన కులపోళ్ళనో, సుట్టాలనో, సేయితులనో, ఎన్ను కోటమేగాని, సదువుకొన్నాడా? మంచోడా? సెడ్డోడా? అనే ఇశచ్చనేలేదుగంద? పైగా ఆ నిలబడే మడిసికూడ తనా పనికి తగుదునా? తగనా? అనే ఆలోశన ఉండదుగంద?

జగన్నాథరావు :– ఏమిరోయి నాగులు! ఇన్నాళ్ళనుంచి నీవు పట్టి చవట వనుకున్నాను. చాల అసాధ్యుడ వేనే!

నాగులు :– ఏమయితే ఏంలాబం బాబయ్యా? నోట్టో అచ్చరంముక్క లేదుగంద? అది లేనోడు పసువుతో సమానమే గంద!

జగన్నాథరావు :– ఇప్పుడుమాత్రం మునుగిపోయిం దేముందిరా? చదువుకోరాదూ?

నాగులు :- (నవ్వి) ఎనక మా అయ్యా ఓ సామెత సెప్పేవాడు. "అరవయి ఏల్లొచ్చాక సదువుక్కోక నోట మట్టికొట్టుకొంటా(రా?" అని. అట్టా ఉండది మీరు సెప్పే యవ్వారం. యాబై ఏల్లు రాబోతుండయి. ఇంకా నాకు సదువేంటి ? వల్లకాటి సదువు.

జగన్నాథరావు :- అదేమిట్రా! ఇప్పుడు మన ప్రజాప్రభుత్వం వారు మీబోటి చదువురాని పెద్దవాళ్ళంతా చదువుకొనేందుకు రాత్రి బళ్లు పెట్టించారు. చాలామంది చదువుకొంటున్నారు. నీకు ఉన్న మాట చెప్పవద్దూ, మన రాజనాల రామయ్యగారు ఉన్నారే ఆయన కూడ ఆ బడిలో చేరి చక్కగా చదవడం, వ్రాయడం నేర్చుకన్నాడు. పైగా ఆయనతో లెఖ్ఖలు చేసేవారు మన ఊళ్లో లేరంటే నమ్ము. ఆయన స్వంతంగా పేపర్లు తెప్పించి చదువుతూ ఉంటాడు. ఇంకా రాజభాష కాబోతూ ఉన్న హిందీని కూడ నేర్చుకుంటున్నాడట. ఆయన ఇప్పుడు ఆ వెనుకటి రామయ్యగాదురోయి నాగులూ! చాల విజ్ఞానం సంపాదించాడు.

నాగులు .- (ఆశ్చర్యముతో) అరే! ఇదేంటి ? బాబయ్యగోరూ! ఆయన సదువుకున్నా(డా అని సెప్పకుండానే నన్ను పిచ్చోణ్ణి సేసి బలె ఆటలు పట్టించారే! అట్టా అయితే ఆయన మనూరికి పెసిరెంటుగా ఉండాల్సినాడే. ఏమంటే ? అసలాయన ఇది యరకే మన గాందీ తాతయ్యాలె సత్తెనికి దర్మానికి పేరుమోగి ఉండాడు.

జగన్నాథరావు :- ఒరేయి నాగులూ! ఇవ్వాళ మన హైస్కూలు వార్షికోత్సవం. ఆసందర్భంలో మన రాజనాల రామయ్యగారూ, జిల్లా విద్యాశాఖాధికారి తదితర పెద్దలు ఉపన్యసిస్తారట. నీవు కూడ రా పోదాం. విందువుగాని.

నాగులు :- అయితే బాబయ్యగోరూ! ఇగను మీరు లెగిసి దిరుసేసుకొని కాపీ బోపీ తాగండి. పెందలకాడె ఎల్దాం.

జగన్నాథరావు :- సరేకాని, నాగులూ! మీటింగుకు ఆ రెవిన్యూ ఇన్స్పెక్టర్ లక్షణరావుగారు కూడ వస్తానన్నారు. నీవు వెళ్లి వారిని పిలచి, అటు బజారునకు పోయి సిజరు సిగిరెట్టు ప్యాకె

ట్రాకటి కొని ఆ గాంధీ గారి విగ్రహం దగ్గర ఉండు. నేను ఇంతలో నా పన్లు సర్దుకొని వస్తాను. అందరం కలసి పోదాం. త్వరగా వెళ్ళు. ఇదుగో డబ్బు. (ఒక రూపాయి కాగితమును ఇచ్చును.)

నాగులు :- (అందుకొని) మీరు మాత్తరం తొందరగా రాండి బాబయ్యగోరూ! మల్లీయాలమిగిలిపోతదేమొ. (నిష్క్రమించును.)

(తెరవ్రాలును.)

## నాల్గవ రంగము.

### హైస్కూలు అవరణము.

(హెడ్మాష్టరు భీమశంకరంగారు, వారి సహోయోపాధ్యాయులు, జిల్లా విద్యాశాఖాధికారి గోపాలరావుగారు, పంచాయితీబోర్డు ప్రెసిడెంటు రాజనాల రామయ్యగారు, తక్కిన పెద్దలు, ఉచితమగు స్థానములలో ఉపన్యాసవేదికపై నాసీనులై యుందురు. ఆవరణమంతయు ప్రేక్షకజనముతో క్రిక్కిరిసి యుండును.)

భీమశంకరం :- (లేచి) ఓ సోదరసోదరీ మణులారా ! నేడు మన పాఠశాల వార్షికోత్సవమై యున్నది. అందుకుగాను మనజిల్లా విద్యాశాఖాధికారిగారగు శ్రీ గోపాలరావుగారిని, మన క్రొత్త పంచాయితీబోర్డు ప్రెసిడెంటు రాజనాల రామయ్యగారిని, తక్కిన పెద్దలను ఆహ్వానించియుంటిమి. వీరందరు మన ఆహ్వానములను అత్యానందముతో అంగీకరించి శ్రమయనక విచ్చేసినందులకు మన అందరి తరఫున నేను వారికి ధన్యవాదము లర్పించుచున్నాను.

(సభలో కరతాళ ధ్వనులు.)

భీమశంకరం :- ఇప్పుడు ఈ మహాసభకు అధ్యక్షులుగాఉండి సభను జయప్రదముగా నడపగలందులకు మన జిల్లా విద్యాశాఖాధికారులగు శ్రీ గోపాలరావుగారిని మిక్కిలిగా ప్రార్థించుచున్నాను.

గోపాలరావు :- (అధ్యక్షపీఠమును అలంకరింప బోవుచుండును.)

భీమశంకరం :- (గోపాలరావుగారి మెడలో పూలమాల వేయును.)

(సభలో కరతాళ ధ్వనులు మిన్ను ముట్టును.)

గోపాలరావు :- (అధ్యక్ష పీఠమును అలంకరించి లేచి) మహాజనులారా! ఇప్పుడు ఈ గ్రామపంచాయితీబోర్డు ప్రెసిడెంటు రాజనాల రామయ్యగారు వయోజన విద్యావశ్యకతనుగూర్చి ఉపన్యసించెదరుగాన మీరు సావధాన మనస్కులరై వినవలయునని మిక్కిలిగా కోరుచున్నాను.

రామయ్య :- (అధ్యక్షులవారిముందున్న మేజాబల్లవద్దకువచ్చి నిలబడును)

భీమశంకరం :- (రామయ్యగారి మెడలో పూలమాలను వేసి కూర్చుండును.)

(సభలో కరతాళధ్వనులు ప్రతిధ్వనించును)

రామయ్య :- (మెడలోని పూలమాలనుతీసి బల్లపైనుంచి)

అధ్యక్షా! సోదర సోదరీ మణులారా! నేడు ఈ వార్షికోత్సవమునకు నన్ను మన హైస్కూలు బృందమువారు ఆహ్వానించి యింతగా గౌరవించినందులకు వారికి నా కృతజ్ఞతాభి వందనములు అర్పించుచున్నాను.

(సభలో కరతాళ ధ్వనులు)

రామయ్య :- అయితే నాకు ఈ విద్యారంగంలో అనుభవము చాల తక్కువ. నిజము చెప్పవలయునంటే నాకేమియు తెలియదనే చెప్పాలి. కాని నా స్వవిషయములో నాసొంత అనుభవమును మీకు చెప్పవలయుననే కోరికతో నేను ఈ ఆహ్వానమును అంగీకరించి యుంటిని. నేను షుమారు నాలుగేండ్లకు ముందు నిరక్షరాస్యుడనుగ నుండుటయు తన్కాలమున నాకు సంభవించిన అవాంతరములును మీలోచాలామందికి తెలిసియే యుండును. అట్టి విపరీతములు సంభవించుటకు కేవలం నాఅవిద్యయే కారణం. అయితే దైవకృపవలన ఎలాగో ఆ సంఘటనలనుండి బయట పడితిని. అప్పటినుండి నాబోటి వయోజనులకు ఎలా విద్య అబ్బునా ? యని అహర్నిశము ఆలోచించేవాణ్ణి. ఇంతలో మన ప్రజాప్రభుత్వం

వారు ఈ గ్రామములో ఒకవయోజన విద్యాలయమును ఏర్పాటు చేసి యున్నారు. అప్పుడు నేను నాయీ అధికవయస్సునైనను లెక్క చేయక వెంటనే ఆ పాఠశాలలోచేరి, కడు సమర్థులైన ఉపాధ్యాయుల బోధనాశక్తివల్లను, విద్యను సంపాదింపవలయుననే నా అకుంఠిత దీక్షవల్లను ఈనాడు నాకుగల ఈ విజ్ఞానమును సంపాదింప గలిగినందుకు నేనెంతయు సంతసించుచున్నాను. అయితే మనము సంపాదించు విద్యను ఆ కుటుంబయ్యవాండ్రవలె దుర్వినియోగము చేయకూడదు. అలాదుర్వినియోగముచేసిన మన బుద్ధిని, మనల్ని, మనమే నాశనం చేసుకొన్నవారమగుటయేగాక ఆ సరస్వతీ దేవినికూడ అపకీర్తిపాలుచేసినవార మగుదుము. అయితే ఇప్పుడు మీకు నేను మనవి చేయునదేమంటే నిరక్షరాస్యులైన వయోజనులందరు విద్యార్జనకు ప్రయత్నించండి. విద్యను నేర్చుటవలన ఎటువంటి లాభములను పొందవచ్చునో వివరించుటకు మన పూర్వ మహాకవియగు భర్తృహరి చెప్పిన ఈ మాటను వినండి.

తే. విద్యయొసగును వినయంబు, । వినయమునను
బడయుపాత్రత, పాత్రత । వలన ధనము,
ధనమువలనను ధర్మంబు, । దానివలన
నైహికాముష్మిక సుఖంబు । లందు నరుఁడు.

గనుక నిరక్షరాస్యులైన ఓ వయోజన సోదరులారా! మీరు విద్యయొక్క విలువను గుర్తించి గతమునుగూర్చి విచారింపక ఇప్పుడైనను మన ప్రభుత్వమువారు ఏర్పాటుచేసియున్న వయోజన విద్యాలయములలోచేరి విద్యనుగడించి విజ్ఞానులుకండి. మన దేశమును ఆవరించియున్న నిరక్షరాస్యత యను రాక్షసిని రూపుమాప ప్రయత్నించండి. మోసగాండ్రు పన్ను వలలను తుత్తునియలు చేయండి. విద్యను నేర్చుటకు వయస్సుతో నిమిత్తములేదు. దానికి నేనే తార్కాణం. బొందిలో ప్రాణమున్నంతవరకు విద్యార్జనకు అవకాశమున్నది. గనుక మీరు వయస్సు మీరినదేయని నిరుత్సాహపడక దీక్షతో విద్యనునేర్చి విజ్ఞానులుకండి. ఇకముందు

ప్రయోజనములైన మీరు విద్యార్జనకు వెనుకంజ వేయరని నమ్ముచు ఇంతటితో నా ఉపన్యాసమును విరమించుచున్నాను.

(అని కూర్చుండును.)

(సభలో కరతాళధ్వనులు చెలరేగును.)

భీమశంకరం :- (లేచి) ఇప్పుడు మన ప్రెసిడెంటుగారు చెప్పిన విషయములను మీరు చక్కగా గ్రహించియుందురని, ఆ విధముగా నడచుకొన ప్రయత్నింతురని నమ్ముచున్నాను. ఇక ఇప్పుడు ఈ మహాసభకు అధ్యక్షులును, మనజిల్లా విద్యాశాఖాధికారులును, అగు శ్రీ గోపాలరావుగారు విద్యావశ్యకతనుగూర్చి ఉపన్యసించెదరు. అయితే ముందుగా వారినిగురించి మీకొక విచిత్రమైన విషయంచెప్తాను. ఏమంటే ? వీరు మనకు అపరిచితులుగారు. ఈ గ్రామవాస్తవ్యులే. ఈ పాఠశాలలో కొంతకాలం విద్యార్థిగా గడపినవారే. అయితే వారు ఇటీవల ఉన్నతవిద్యకొరకు మదరాసులో ఉండుటవలన మీలో కొంతమందికి జ్ఞప్తిలేకపోవచ్చును. వీరు మన నూతన పంచాయితీబోర్డు ప్రెసిడెంటుగారగు ఈ రాజనాల రామయ్యగారికి మేనల్లుడు, అల్లుడును అయి యున్నారు.

(సభలో కరతాళ ధ్వనులు.)

భీమశంకరం :- వీరి అపూర్వ మేధాశక్తికిమెచ్చి ప్రభుత్వశాఖలలో ప్రతిశాఖయు నుద్యోగమిచ్చుటకు ఆహ్వానించినవి. కాని వీరికి విద్యయందుగల అద్వితీయమగు అభిమానమునుబట్టి ఈ విద్యాశాఖలో తొలుదొల్తగా ఈ పదవి నలంకరించిరి. ఇప్పుడు మీరు వారు ఈయబోవు సందేశమును సావధానమనస్కులరై వినవలయునని నా ప్రార్థన. (అని కూర్చుండును.)

గోపాలరావు :- (లేచి కళ్ళజోడును సవరించుకొనుచు)

ప్రియ సోదరీ సోదరులారా ! మీరు నన్ను ఆహ్వానించి యింత గౌరవమును చూపినందులకు మీకు నా మనఃపూర్వక ధన్యవాదము లర్పించుచున్నాను.

(సభలో కరతాళ ధ్వనులు.)

గోపాలరావు :- ఈ విద్యారంగంలో సేవచేయవలెననే నా చిరకాల వాంఛ ఇప్పటికి ఫలించినందులకు నేనెంతయు సంతసించుచున్నాను. కాని మన దేశమును, విద్యావిషయములో విదేశములకు పోల్చిచూచుకొంటే గుండె నీరైపోవుచున్నది. ఏమంటారా? విదేశాలలో నూటికి తొంబదిమంది విద్య నేర్చినవారుంటే మన దేశములో నూటికి పదిమంది మాత్రమే గలరు. దీనినిబట్టి మన దేశము విద్యలో ఎంత వెనుకబడి యున్నదో మీరే ఆలోచించండి. విద్యనుబట్టి విజ్ఞానం కలుగుతుంది. విజ్ఞానాన్నిబట్టి దేశాభ్యుదయం పెంపొందుతుంది. ఇప్పుడు మనము చూచుచున్న, అనుభవించుచున్న, ఈ రైలుబండ్లను, రేడియోలను, విమానములను, విద్యుద్దీపములను, విదేశ విజ్ఞాన శాస్త్రవేత్తలేగదా! మొదట కనిపెట్టి తనివి తీర అనుభవించి తుదకు మనకు ప్రసాదించినది. వానినే మనం మహాప్రసాదమని స్వీకరించి అనుభవిస్తున్నాం. మన పొరుగు దేశాలు అట్టి విజ్ఞాన సంపదతో తులతూగుతూ ఉంటే, మన దేశం ఇట్టి అధోగతిపాలై యున్నందులకు మన మెంత సిగ్గుపడవలయునో బాగా ఆలోచించండి. గనుక ఇప్పుడు మీకు ముఖ్యముగా మనవి చేయున దేమంటే, మన దేశం విజ్ఞానవేత్తలతో విరాజిల్లి విదేశాలతో సరితూగాలంటే తల్లిదండ్రులైన ప్రతివారు తమ బిడ్డలకు విద్యాబుద్ధులు గరిపించాలనే దీక్షను బూనాలి. ఈ దీక్ష నెరవేరవలెనంటే అందరు కనీసం చదువను వ్రాయను నేర్చిన బిడ్డలనే ఇచ్చి పుచ్చుకొను పద్ధతి నవలంబించాలి. అయితే ప్రతివారు తమ బిడ్డలను ఉద్యోగ కాంక్షతో చదివించక, విజ్ఞాన కాంక్షతో చదివించాలి. అప్పుడే మనకు విద్య యందు నిజమైన ఆదరాభిమానములు ఏర్పడగలవు. కనుక మీరు విద్యయొక్క ఆవశ్యకతను గుర్తించి మీ బిడ్డలకు మీ శక్తికొలది విద్యాబుద్ధులు నేర్పించండి. విద్యార్జనకు, కుల, మత, లింగ భేదములతో నిమిత్తములేదు. మీరు మీ బిడ్డల భవిష్యత్తుకొరకు మీ శక్తికొలది స్థిరచరాస్తులను సంపాదించి ఈయవలయునని ఎలా అహర్నిశము ప్రయత్ని

స్తుంటారో అలాగే అంతకుమించిన ఆసక్తితో వారికి విద్యాధనం గడించిపెట్టాలనే తాపత్రయపడండి. ఆనాడే మనదేశం విజ్ఞాన వేత్తలకు నిలయమౌతుంది. అప్పుడు మనం ఈ నవయుగంలో నవ్యకాంతులతో విరాజిల్లగలం. అక్షరజ్ఞానము లేనివారు ఈ ఆధునిక యుగంలో అంధులని తెలిసికొనండి. తెలివితేటలకు విద్య గీటురాయివంటిది. కాబట్టి విద్యలేని తెలివితేటలు ప్రకాశింప జాలవు. మరియు ఎలాగైతే దీపము అంధకారమును పోగొట్టి దివ్యమైన వెలుగునిచ్చుచున్నదో అలాగే విద్య అజ్ఞానాంధకారమును పోగొట్టి "జ్ఞాన"మను వెలుగునిచ్చును. గనుక ఓ సోదర సోదరీమణులారా! మీరు మీ బిడ్డలకు తగుశ్రద్ధతో విద్యను నేర్పించి మన దేశమును ఆవరించియున్న అవిద్యాంధకారమును పటాపంచలు చేయుదురని ఆశించుచు ఇంతటితో నా ఉపన్యాసమును ముగించుచున్నాను. జై హింద్ ! (కూర్చుండును.)

(సభలో కరతాళధ్వనులు చెలరేగును,)

భీమశంకరం :- (లేచి) సభాసదులారా! మనకు చిరపరిచితులును, మన జిల్లా విద్యాశాఖాధికారులును అగు శ్రీ గోపాలరావుగారు మన దేశములోని విద్యా పరిస్థితినిగురించియు, అందులకు మనము తీసికొనవలసినచర్యను గురించియు, చేసిన గంభీరోపన్యాసము నిజముగా మనల్ని మేల్కొల్పి విద్యారంగంలోనికి ఉరికించిందనే చెప్పాలి. వారు నుడివినట్లు, తలిదండ్రులైన ప్రతివారును తమ బిడ్డలను విద్యాధికులుగను, విజ్ఞానవేత్తలుగను జేయుటకు నేడే శపథము పూనుదురని ఆశించుచున్నాను. జై హింద్ !

(అందరును లేచి జాతీయగీతము పాడుచుండగా తెరవ్రాలును.)

మంగళం మహత్.

సర్వం సంపూర్ణమ్.



ది ఓరియన్ట్ పవర్ ప్రెస్, తెనాలి